క॥ ఏలిన జేజే నిన్నిల । గాలిచి చెడఁజేయఁగాంచె॰ రా! చెన్నంటీ!
యేలికఁ జేరెద నేటి॰చేలిక, నా,కలని కన్న॰ సకల కతఁడటఁ 36

టీ—ఏలికజేజే=పోషణకర్తయైన విష్ణువు, ఏలిక జేరెదఁ = నా ప్రభువగు రాముని జేరువాఁడ, కలనికిఁ +అన్నఁ=యుద్ధమున కనిన.

క॥ రాచెనెలలెంక నడచెఁగ! నాచేక. తనదండ్లనంచె ॰ నంతట,నాతం
డేచి తనకాల దండ్లం।దాచి కలంచి యడఁగించి॰తా నిటఁ జేరెఁ 37

టీ—రాచెనెలలెంక=రాజచంద్రునిభటు డంగదుఁడు, ఆతండు= అంగదుఁడు, తాచి=తన్ని, ఇటఁ= రామునికడకు.

—* వానర రాక్షస సంకుల సమరము *—

ఉ. చేరి, కడంక రాచెనెల ॰ చెంగటఁ జేరి, యొఱంగి చేౘల్
దారి, కడంక నాతనికి ॰ దాచేక నాడిన, రాయఁ డక్కచేఁ
దేరి, కనంగ దండ్లతెగ ॰ తేఁటగ నగ్గలికెక్కఁ; జేల్లల్
దారి, కనంగనాఁడ, తన ॰ దండ్లడరెం, గలనయ్యె నాఁడటఁ 38

టీ—కడంక=పూనిక, కడంక=ధీరత్వము, చేౘల్ దారికిఁ= అనంగఁ=వనమున కనఁగా, ఆడఁ=ఆలంకయందు, కలను+అయ్యెఁ= యుద్ధమయ్యెను.

క॥ గట్టిజిగిఁ, జెట్లదిరిఁగడి । జెట్టితెగల్, రక్కసితెగఁ ॰ చెలరేగి జేతల్
కట్టి నెఱసరి తనానం । గట్టి కడంక ననిఁజేయఁ ॰ గా, నా, నేలఁ 39

టీ—గట్టిజిగిఁ=దృఢమైన శరీరబలముచేత, లేక ప్రకాశము చేత చెట్ల... తెగల్=వృక్షచరులందు మొనగాండ్రయొక్క సమూహ ములు, నెఱసరితనానఁ=శూరత్వముచేత.

క. ఇదిక, న్నిదికా, లిదికే। లిదితలయని తెలియరాక ॰ నెచ్చటఁ గన్నం
జేదిసిన లెంకలకాల్ కేళ్ళదికిన నలయేళ్ళచాళ ॰నటఁగననయ్యెఁ. 40

టీ—చేదిసిన=విరిగిపోయిన, లెంక... కేళ్ళు + అదికిన=కాలిబంట్ల యొక్క చేతులు కాళ్ళతోఁ గలిసిన, నల, నల్లయొక్క రూపాంత రము, నలయేళ్ళచాళ్లఁ=రక్తవాహినుల సమూహమును, అటఁ= ఆయుద్ధభూమియందు.

—* ఇంద్రజిత్తు, రామలక్ష్మణుల, నాగపాశబద్ధులఁ జేయుట. *—

ఉ॥ ఆతటి, జోయరా, గడలి ॰ యం, దడఁగం, దెఱగంటిజేని కం,
చేతటినైనఁ గల్లతని ॰ నేడికతత్తడికాని నెన్నితే

జీతెగ నంకలాలఁ దెగ • సింగిణి చిక్కుడిదాల నెల్ల జే
జేతెగ, లెన్నఁ నండి, యనిఁ • జేయఁగ నయని దాసె రతిరిన్. 41

టీ—హాయన =ఛాయాపతి (సూర్యుఁడు), కడలి...గన్= సముద్రమున గ్రుంకగా, తెలి...కంటు=ఇంద్రజిత్తు, ఏశటి...తనిన్ ఎప్పటికప్పుడు గల్గువాఁడైన, ఏడిక+తత్తడికానిన్=గొఱ్ఱెయే గుఱ్ఱముగాగలవానిని (ప్రద్యోతజాతుఁడైన అగ్నిని) రాయనిన్=రామునిన్, రతిరిన్=రాత్రియందు.

చ॥ కదియఁగఁ దాసి, రేసి, తన • గారడి నింగిని నీటిదార్లయం,
దదికి కడింది సింగిణిని • నల్గిడి నారినిలాగి, రాచెదం,
ద్దరి చేఁగనేసి, యల • యార్కినితేండ్రిఁ గలంచియొంచెఁ దా
రిది, జడికా, రనంగ నెద • నేర్చెడి యీఁటెనాఁటె నేఁటిలన్. 42

టీ—గారడి=మాయ, నీటిదార్లు=జలధరములు (మేఘములు) ఆర్కిన్=సుగ్రీవుని, తేండ్రిన్ = రామలక్ష్మణులను, జడికారు=వర్షాకాలము.

ఉత్సాహ॥ అంత నేలఁ రాయఁడతని • యతిది చేతలెల్ల నా
చెంత రక్కసి చెలికాని • చేత సరిగఁ దెలిసి, త
న్నింత గలఁచె నని చెడంద • నెనఁగఁ గినిసి కడిఁది చి
క్కంత నతని నేయఁ దలఁగి • యద్ది చెనియెఁ గారడిన్. 43

టీ—అతిది చేతలు=ఆశ్చర్య కార్యములు, రక్కసి చెలికాని చేతన్=రాక్షసుఁడైన స్నేహితుఁడు (విభీషణుడు) కినిసి=కోపించి, అద్ది= ఆబాణను, గారడిన్=మాయచేత.

మత్తకోకిల॥ దాని కింత కలంగి రానెల • దాయనేర్పుఁగలట్టిరిం
గానలం జెరలాడె దయ్యలఁ • గాంచి యంటిన,రక్కసీం
డా, నెఱా నెఱుఁగ్ల నాదెస • కంచి రానెల లిద్దఱం
దానె కట్టిడె గాలినానెడి • దంట చిల్కిడి చేయ్యనన్.

టీ—కల+అట్టిరిన్=కలిగినటువంటి వారిని, కాన...దయ్యలన్ వనచరులను (కోతులను) గాలి...చిల్కిడి=నాగబాణము అనగా నాగపాశమునుంచి, కట్టిడె=కట్టివేసెను.

తో॥ కట్టిడి తా రిలఁ • గంది కదల్కన్
నెట్టిన పాయిని • నిల్చిన నాతం
డట్టె తనంతటి • యాతఁడెటం లే
నట్టె, చేనెం దన • యయ్యఁ గనంగన్. 45

టీ—కట్టు+ఇడి, తారు=వారు-రామలక్ష్మణులు, ఇలన్=భూమిపైన.

---

—• నాగపాశ విమోచనము •—

పంచచామరము.

చేనంగ నంతటం దనంతఁ • జెక్కనయ్య తండ్రి హా
చ్చేనంగఁ జేల్, కడానికిన్నె • రావితాల్చి, తెల్లనై
చేనంగ నల్దెసల్ జిగి న్ని • జేనఁ గాఁలిల్ జేగానకై
చేనంగ నెంచి నింగిదారిఁ • జేరెఁ దాతకం దిలన్. 46

టీ—చెక్కనయ్యతండ్రి=మన్మథునితండ్రి (విష్ణువు) హాచ్చే+అనన్గన్చేల్=నీవు కేవలము పరవస్తువువు. నిన్ను బంధించువాఁడుండెనా? యని పల్కుటకు, కడానికిన్నెర=బంగారువీణెను, నిజేన... కై=సత్యలోకమునకు, నింగిదారి=ఆకాశమార్గము, తాతకందు=బ్రహ్మపుత్రుఁడు (నారదుఁడు.)

ఆ॥ జారె చాయతేని • జాతియిత్తిగనేల
చేల నెలనడాని • జుకదారి
కాలిజేంట లచ్చి • గద్దియల్ చెంగటఁ
జేరి కైజేతఁ దలఁ • జేర్చి యెఱఁగి. 47

టీ—జారె=ఆకాశమునుండి క్రిందికి దిగివచ్చి, చాయతేనిజాతి=సూర్యవంశము, ఇరు+తిగ=ఇత్తిగ (రెండుమూఁడు, లారు) నేలచేల=సముద్రము (ఆరవసముద్రము=క్షీరజలధి) నెల...దారి=మాసమధ్య దినము నాటి చంద్రుఁడు, లచ్చిగద్దియల్=తామరలు.

—♦ నారదకృత రామస్తవము ♦—



కమలవిలసితము॥ అడరఁగఁ దిగతెగ ♦ లల తిగ జేజేల్
కడ నడ రతఁడని ♦ కడఁక ననంగా
నడరఁగఁ గలిగిన ♦ యతఁడ! జగాలం
దడయక యడరిచి ♦ నలిచెడి జేజే. 48

టీ—తిగతెగలు=త్రిమతములు, తిగ...కడన్=బ్రహ్మ విష్ణు రుద్రాదుల కవ్వల.

తోటకము॥ ఇలనేచఁగలట్టిడి ♦ నెట్టిడినేం
గలఁగం గని రాలిచి ♦ క్రిచ్చఱి నా
యిలనేచక నిన్నెద ♦ నెం చేతనిం
గలఁగించక చక్కఁగఁ ♦ గాచేతఁడా! 49

టీ—ఏచన్+కల+అట్టిడి=బాధించగలవానిని, ఎట్టిడినేన్=ఎటువంటివానినైనను.

స్వాగతము॥ ఎన్నియేం దలల ♦ హెచ్చినతేఁగం
చేన్ని తల్పుఁజేన ♦ హె చ్చఱసీటం
జిన్నెలం గలిగి ♦ చిన్నియతండై
చె న్నెసంగి తట ♦ చెల్లరె? తేఁడా! 50

టీ—ఎన్ని...తేఁడు=లెక్కలేని తలలు కాళ్లు సేతులు గల ప్రభువు (విరాట్టు) సీటం ... తండై=జలమందు వటపత్రశాయియై, చెల్లరె=ఆహా ఆశ్చర్యము.

స్రగ్విణి॥ తాతయైచేసి యం ♦ తం, జెలంగంగ న
ల్లాతఁడై చేసి, హె ♦ చ్చార్చిరాల్పంగఁ, దె
ల్లాతఁడై, యన్నిట ♦ న్హాళిఁ జెన్నారఁ గ్రా
లాతఁడా! యన్నియై ♦ హాయిదేలాతఁడా! 51

టీ—తాత=బ్రహ్మ, నల్ల + ఆతఁడు=నల్లవాఁడనఁగా విష్ణువు, తెల్లాతఁడు=రుద్రుఁడు, హాళిన్=సంతతము, అన్నియై=సమస్తమునీవేయై

దండకము.

అరిది, సరిది, లేని తేజైన జేజేలజేజే, జగా లెన్నఁగా నీయె
డం దాలికం గల్గి నిన్నెన్నగల్ దంటలం గాముఁగా; నేలజేజేల జేజేలఁ
గారించి, యీనేల కెగ్గైన కర్జాలఁ జేయంగ నైనట్టిరిం జించి చెండాడి
నీకాలిచేరాయఁగాఁ; గల్గె దీనేల నెట్లన్న, నాతాతకన్నంటఁగా, నల్క-
తల్ తెక్కలిం చేగి సంద్రానఁ డాగంగ నైనట్టి, రాకాసితేనిం దెఱంగం
టైయె చెండి యన్నల్కతల్ తాతకీయంగ లేదా? నెఱేందిండికై యల్ల
రాకాసిదండంత, జేజేలదండంతఁ, దిచ్చంగనైనట్టి సంద్రాని నాఁ,
డడఁగిన తఱిగట్లరా నట్టె నల్గాసరీఁడై తలందాల్చి యెత్తంగలేదా?
యిలం గానఁగారాని కాల్దండ్లఁ రాటెంకియందిడ్డ రాకాసిసిం దెల్లయ్యెదె
యణంచేంగలేదా? యెదంగట్టినేస్తిం దలంచేంగఁ గం దింతయే నాతనిం
దల్పరాదన్న రాకాసిరా నెఱసరియయి చించి చెండాడఁగాలేద? యా
నెఱాచాగకాఁడైన రాకాసిరాఁ గిన్కచేగట్టకం దైయణంగంగ నేర్లిక్కం
దనే దాచ లేదా? జగా, జేన్నిగట్టై కయుం, సింగిణిందాల్చి, కన్నయ్యఁ
జెండెంగదా యాం చేదం గిన్నిరారాయనిగిడ్రిసన్నాతనిం జెండిరాతేండ్రి
చేల్ తిగసతతెగలార్చి చేలంగ నా నల్లచేఁ దాడ్రి జేజేల తెంకిందగం
గాద్రిలగల్ చేతలం దీర్పలేదా? యికంజోత్తలల్ గక్కసీఁడేచి జేజేల
నేచేంగ నాచెన్నటిం జెండఁ జేల్ తేర్లగా జేని కాద్రిల్గంటియం దిచ్చటం
గల్గఁగాలేద! సీయట్టి డిల్లైఱక్కఁజేరంగ నేలయ్య? సీజెక్కయైనట్టి
కానంగరానట్టి కాల్దిండ్ల రారిక్కరాఁజేరి కాల్దిండ్లక ట్లాద్ర్పరాదా?
యటం చేడి, జేజేల నెన్నేని తాఁజేసి తండ్రిం గనం దెల్ జేడల్ దారి
తానేగఁగా, నేలతేఁ డంతఁ గాల్దిండ్లరాదాయ డెందాన నానం
దలంచెం దలంచేం దడాల్నన్. 52

టీ—అరిది=వింత, సరిది=సమానమైనది, తేజు+ఐన=తేజోరూపమైన, జేజేలజేజే=దేవదేవా! నేలజేజేలన్=భూసురులను, ఈనేలకున్+ఎగ్గైన=ఈభూమికి కీడైనలేక అయిష్టమైన, కర్జాలు=కార్యములు, తాత=బ్రహ్మ, కన్నంటన్=నిద్రపట్టఁగా, నల్కతల్=చతుర్వేదములు, తెక్కలించి=దొంగిలించి, సంద్రాన...తేనిం=సముద్రమునదూరిన సోమకాసు

రుని, తెలంగంటి=మత్స్యము, తరిగట్ల రా=మందరపర్వత రాజో, నల్ దాన రీడు=కూర్మము, ఇలం...రాకాసి=భూమిని బాతాళమునకుఁ గొంపో యినహిరణ్యాక్షుని, తెల్లని+పదు=శ్వేతవరాహము, కట్టినేస్తిగ=అర్జున మితుత్రిఁడు (కృష్ణుఁడు) నెఱసరి=నరసింహము, చాగకాఁడైన రాకాసి రాగ=దాతయైనట్టి బలిచక్రవర్తిని, గిట్టకందై=పొట్టిబ్రహ్మచారియై జేన్నిగట్టు=బ్రాహ్మణుఁడు (పరశురాముఁడు) కన్నయ్య=కన్నతండ్రి జమదగ్ని, క్రిడిసన్నాతనిగ=అర్జుననామకుని=(కార్తవీర్యార్జునుని) తిగ సతతెగలు= (3×7=21) ఇరువది యొక్కమార్లు, నల్ల=రక్తము, చాల్త... సీఁడు=రావణుఁడు, చోల్...గంటి=పంక్తిరథునిభార్య, కౌసల్య, ఎఱ్ఱ= ఎఱుకయనఁగాదెల్వి, నీజక్కి=నీగుజ్జము, కానం...జీరి=పాములది నెడి పక్షిరాజచంద్రునిబిలిచి, గాద్దిండ్లకట్లు=నాగపాశములు, జేజేలు= నమస్కారములు, గాద్దిం...దాయ=వాయుభక్షణసేయు పాములవైరి (గరుత్మంతుడు)

ఉ॥ తెక్కల గాలినిల్కచేన•రిక్కలదారిని నీటిదారిచో,
లిక్కల దేలితేలి చన, నెల్లెడలం గలచెట్ల గట్లచో,
ల క్కడ లెల్లఁ దల్లడిలి • య య్యలలం గఱకట్టఁ దాటఁగా
తెక్కలదారిరాచెనెల•తేసికి దగ్గఱఁ జేరెఁ జేరిన్.

టీ—రిక్కలదారి=నక్షత్రమార్గము, నీటిదారిచోల్=జలధరస మూహము, తెక్క...నెల=పక్షిరాజచందుత్రిఁడు-(గరుత్మంతుఁడు)

శా॥ రా,రేరాయల రాచేదండ్ల కనఁగా•రా న్కాలిక, ట్లెల్ల ర
య్యారే! నాగఁ దలంగియేఁగె దెసలే•కా నేలఁ దాల్పాతఁడేగ
రా రే! యంచని కాయఁడా? యనిన చేం•దానం దెగల్గాఁ, గనం
గా, రేసాగెడి దిట్టఁ జేరఁజేన ని•క్క ట్లెట్ల రానయ్యెడిగ. 54

టీ—రారేరాయఁ=రాజచందుత్రిల (రామలక్ష్మణుల) కనఁ... కట్లు=గాఢపదబంధనములు (పాముకట్లు) దెసలేక=దిక్కుగానక, నేలఁ దాల్పాతఁడేగ=భూమిని ధరించిన శేషుఁడైనను, రేసాగెడి=రాతు్రిలు సంచరించెడు (రక్షసుఁడు) వాఁడు, ఇక్కట్లు=కష్టములు. రాత్రిదిరుగు దొంగనుగూడిన కట్టుఁబడును.

ఉత్సాహ॥ తెక్కదారి రాయఁ డంత • తేనిచెంతఁ జేరి తాఁ
జెక్కఁగా నెఱింగి రాచె • చెక్కనయ్యఁ జెయ్యనం
జెక్కఁదేర్చి యాన నంది • సాగి నింగి నేగె, నా
రక్కసీం డ్రి డఁకఁగ నన్న • రాగఁ జీర నేగెనాఁన్. 55

టీ—తెక్కదారి రాయఁడు =పక్షిరాజు(గరుత్మంతుఁడు) ఎఱింగి=నమస్కరించి, రాచెచెక్కనయ్య=రాజమన్మథుండు, అనఁగా రాముఁడు, అన్న=అనూరుఁడు (సూర్యరథసారధి) చీరన్=పిలుచుటకు, ఏగెనాఁన్=వెళ్ళినాఁడో యనునట్లు.

—* సూర్యోదయము *—

ఉత్సాహ॥ అంతలెస్స యత్రితేని • యయ్య కానరయ్యె, నా
యంతతేని నిట్లలంచె • హాళి లంకరయఁ, డీ
జెంతనార్చి కం దెడంద • సంతసించె నంచె దం
చెంత నీటలేచి చూచి • నట్ల చెలఁగఁ గైతెగల్. 56

టీ—లెస్స...యయ్య=సుగ్రీవుని తండ్రి (సూర్యుఁడు) నాయంతతేనిన్=సూర్యప్రకాశుఁడైన రాముని, కందు=కొడుకైన సుగ్రీవుఁడు, అంచెదన్+అంచున్=పంపెదగాకయని, కైతెగల్ = కరసమూహము (అనఁగా కిరణ సమూహము)

ఉ॥ లంకఁ గలంచెఁగాఁ దిరిగి • లగ్గల కెక్కఁగ నేలతేనిదం,
డ్లంకిలి సేయలేక, తన • దైనదరింగల లెంకదంటలన్
జెంకక లంకతేఁ, డనిచి • నం గడతేర్చిరి సారె కింతయే
నంకిలిలేక, రాచెనెల • యండన కల్గిన లెంక లెంతయేన్. 57

టీ—లగ్గ...గన్ = చుట్టు ముట్టడించిన, రాచెనెల = రాజచంద్రుఁడు.

క॥ నలయొఱజిగికన్ రక్కసిఁ। గలఁగని రక్కసిని గడిఁది • కాళ్లం గేళ్లం
గలరక్కసిదండ్లన్నిఁటిఁ। గలఁయఁగ నేల్ దణిగఁజెంతఁ • గ్రాల్ రక్కసినిన్.

టీ—నల...రక్కసి=ధూమ్రాక్షుఁడు, కల...సిని=అకంపనుని, కడిది...రక్కసి=మహాకాయుఁడు.

మ॥ అసినేలం దణిదంట దం డ్లడగిన • ట్లంతం దెఱంగంటిరా
యసికం డ్లలికి చెంత కేగి యనఁగా • నాలించి రాజేని దా

నని .దాఁకఁ నగ రెల్లఁజోట, ననిసే•యం, డాసి రెంతేనిఁ జే
క్కని తేజీ, లఱదాల నెక్కి నలఁదా౯•గం గన్న దిట్టల్ తెగల్.

టీ__అని నేలఁ=యుద్ధభూమియందు, దణిదంట=సేనానాయకుఁడు, దండ్లు=సేనలు, తెఱ...కంట్లు=ఇంద్రవైరులు (రాక్షసులు) పలికఁ=రావణాసురుని యొక్క, రాజేనిఁ=రాముని, నల...తెగల్=(నల=నల్ల యొక్క రూపము) రక్తపానము సేయు రాక్షసులు.

ఉ॥ డాసిన, లంక తేఁడఁటఁ, గ•డానినగల్ నెఱిజీనిచేల, లెం
తే, సిరి గా౯లఁదాల్చి, నరి • దీఁటిన త త్తడిజంటఁ గట్టి కై
సేసిన తేరినెక్కి, కయిఁ • జే! యని లెంక తెగల్ దెసల్న, రా
నైసిరి గా౯లఁగాఁ జెనె, న•గార, జెగా, నడిసేయ నన్కినై.

టీ__డాసినఁ = సైన్యములు యుద్ధసన్నద్ధులై దగ్గరజేరఁగా, లంక తేఁడు=రావణుఁడు, కై సేసిన=అలంకారము సేసిన. కయిఁ=హస్తముతో జే!=జయము, కైసిరి=భుజబలము, నగార=యుద్ధమున కేగునపుడు మ్రోగించు వాద్యవిశేషము.

క॥ చేవి సింగాణిని జిక్కిడి । తన జా న్గండ కరి లాగి • తగ్గనికన్కం
గని నాఁటెఁ జిత్తజేల్లన । దనసత్తి నెలంగ రాచే•దండ్లయెడదలఁ.

టీ__జాన్గు+అండకుఁ=చెవిదగ్గరకు, అరిఁ=నారిని, చిత్తజేల్లు+అనఁ=చిత్తకార్తెయందలి వానజేల్లో యన్నట్లు, చిత్తశబ్దము సంస్కృతమైనను, చిత్తజేల్లని నామము కనుక తెనుగునవాడవచ్చును. ఎడదలఁ=హృదయములందు.

క॥ నాఁటి కడిందిగరేగం । దీఁటిన నాచాయకం దె • దిర్చి కడంకం
దాఁటి కడిఁది గట్టేసెం । గాఁటికిఁ జేరెదని రాచే•కం టెద నదరఁ 62

టీ__చాయకందు=సుగ్రీవుఁడు, సూర్యపుత్రుఁడగుటం జేసి సూర్యునిభార్య ఛాయాదేవి పుత్రుఁడనుటగూడ సాంప్రదాయార్థమైయున్నది, గట్టు=కొండ, రాచేకంటు=రాజైయున రామునివైరి (రావణుఁడు) ఎదఁ=మనమునందు.

క॥ ఇక్కరణి నేయఁగా సా । రక్కసిరాచే నెల, దాని • రహిని నడానఁ
జెక్కడఁచి నారసాల నెక్కని చిల్కేసి యార్కి సత్తినడంచెఁ.

టీ—రక్కసిరాచేనెల=రాక్షసరాజచంద్రుఁడు (రావణుఁడు) నార సాలన్=బాణములచేత, సత్తి=(శక్తిభవము) సామర్థ్యము.

చ॥ అణఁచిన నేలఁజేరె నతఁ; డతెలితత్తడికాని కత్తిచే
నణఁగిన గట్లరాయఁ డన; నాయెడ లచ్చన దాయఁ దాఁకఁగా
గణఁక, నతం, డదల్చెనఁట కైసిరి రానెల, యంత దాయ హె
చ్చణఁచేఁగ దాకి కం టెడద నాయెడఁ గ్రిక్కదలంగ నిట్లనెన్.

టీ—అతఁడు=అసుగ్రీవుఁడు, తెలితత్తడికాని=తెల్లనిగుఱ్ఱము (ఉచ్చైశ్రవము) గలవాని (ఇంద్రుని) యొక్క, కత్తి=వజ్రాయుధము, గట్లరాయఁడు=కొండలఱేఁడు, రానెల=దాయ=పగవాఁడు, కంటు=పగ వాఁడు, ఎదన్=హృదయమునందు,

ఉ॥ తక్కరికాఁడ! యొగ్గడరఁ దారిచి యేగక యంతఁ దాకి తిం
కెక్కడికేగె దీకరణి నేలినతాతయ కాయనెంచినం
జెక్కక యేగనీయ నని సింగిణిఁ జిక్కఁదరించె, దానినిం
జెక్కియడంచె రాచేనెల చేక్కఁగనెక్కిన గాలికం దెదన్. 65

టీ—తాతయ=తాతయ్య యనఁగా బ్రహ్మను గన్నతండ్రి విష్ణువు రాచ...కందు=లక్ష్మణుఁడెక్కిన హనుమంతునియొక్క, ఎదన్= ఱొమ్మున.

పంచచామరము

కలంచినంత రాచేదిట్ట గండెసంగ దాయన
ట్లలంచి దిట్టనారసాన నల్లరక్కసీని క
త్తలానిజేంట, డాల్, కడింది దంటసాహిణీని, దే
గ్చలానరాలఁజేసి యంచె రక్కసీండ్రఁ దేగ నాన్. 66

టీ—రాచేదిట్ట=రాజులయందుధీరుఁడు (లక్ష్మణుఁడు) రక్కసీని= రావణుని, కత్తలానిజేంట=గుఱ్ఱములజేంట, సాహిణీని=సారధిని తేరు+ చలానన్, రక్క...నాన్=రాక్షసుల దోడితెమ్మని పంపెనో యన్నట్లు.

ఉ॥ అంచిననాతఁ డట్లరిగి యాతనిజేంటన కల్గినట్టిఁడే
చించిన దాయతేండ్ర నని జించెడినంచని, యెంచి, చీరఁగా
నంచిన లెంకలేగి తన యన్న కడంకన చీరెనం చేతిం
గించినఁ, గంటినెత్తి కన కేచెన రక్కసిదిట్ట, తారఁటన్. 67

టీ—ఆతఁడు=రావణుఁడు, ఆతని...దే=వానిచేతఁగాఁబుట్టిన కుంభకర్ణుడే, చించిన...చించెదిక్=శత్రురాజులఁజెంపిన, చెంపవచ్చునని, చీరెక్=పిల్చెను, తారు=వారు.

—* కుంభకర్ణ యుద్ధము *—

ఉ॥ తిండికి నెంతయే నెఱచి, • తిన్న తఱిం దగఁగ్రాయెనఁ దీర్చఁగా
దండిగ నల్ల, గిండ్లనిడి • దగ్గరఁ జేరిచి హత్తి దండ్ల గై
దండల నల్లఁజేయఁ దన • దండన కంకటి నల్లిగిల్లె నం
చేండల లెంకదం డ్లడల • హా! యని రాయనిదాయ లేచెఁ దాన్. 68

టీ—ఎఱచి=మాంసము, నల్ల=రక్తము, హత్తి= హస్తిశబ్దభవము, కంకటి=మంచము

తే॥ లేచి కన్నంటనీక యి • ట్లేఁటి రిది
యేల? యని, లెంకలెఱఁగించే • నెఱఁగి తెలిసి,
తిండిఁ దిని, యన్నకడకేగి • తెలిచి నిలిచి
నంతఁ, జేల్తలగయాళి • యతని కనియె. 69

టీ—చేల్త...యాళి=పంక్తిశిరుఁడగు రావణుఁడు, ఆతనికిక్=ఆకుంభకర్ణునకు, తెలిచి=కొలిచి

క॥ ఘటకర్ణ! రాచెనెల లం|తటఁజేరి కలంచి రెల్ల • దండ్ల నడర, నేఁ
డటకేగి తెండ్రాలిచి|యిటఁజేరఁగదయ్యయన్న • నెఱఁగియతఁడటన్

టీ— ఘటకర్ణ=కుంభకర్ణ, రాచెనెలలు=రాజచంద్రులు (రామలక్ష్మణులు)

చ॥ కదలి, కడిందిజెంగల నఁగడ్తలఁ దాఁటి చేనంగ, సత్తియా?
చేదియఁగఁ జేయఁజో ల్త్రిగదె • నం దగనేలెడి దిట్టయా? యటం
చేనఁ గని యేగి రాతనిని • హెచ్చ్రెలఁ గాంచిన లెంకలెల్ల, తేఁ
డెదఁ గననేల? యం చేనికి • నేద్దెర తేఁచఁ గలంచి రాతనిన్. 71

టీ—సత్తియా?=శక్తియా?, తిగ...యా?=మూఁడవదిక్కునేలు యముఁడా? ఎదన్=భీతిచేత, ఆతనిన్=ఆకుంభకర్ణుని, కలంచిరి=కల్తబెట్టిరి

ఉ॥ అంతట నైందిక్రం దదరి • యాతనిఁదాకి కడింది గట్టిదం
గ్రింతగఁ గాడనేయుఁ, దన • కైఁగల కత్తినడంచె, రాచకం;

టంతట గట్లఁ జెట్లతెగ • నార్కియడల్ గననేయ రాల్చి, దం
డంత గనంగ నార్కిఁదన • యందిడి దాయచేనంగఁ డెంకికిన్. 72

టీ— ఐంద్రి=ఇంద్రుకొడుకు (వాలి) కందు=ఆ వాలికొడు కంగదుఁడు, రాచేకంటు=రాజవిరోధి, దాయ=శత్రువు (కుంభకర్ణుఁడు)

ఉ॥ దారిఁగలంచి రక్కసిని, • దా నిలరాయని జేర నార్కి; నేల్
దారి, యెదిర్చి రక్కసిఁ, గ • లంచి యలంచి కడిందిగాలిచి
ల్కేరి, కడంకఁ గే లడఁగ • నేసిర, దగ్గర రక్కసీఁడటం
గేరి కలంగఁ గత్తినిడి • కేల, ననిం జెరిగించె తేఁ డటన్. 73

టీ—ఆర్కి=సుగ్రీవుఁడు, తేఁడు=రాముఁడు.

చ॥ అఱనెల నారసానఁ దగ•నాతనినిం దలద్రెళ్ళనేయ నా
నెఱసరి చిక్కినట్టి కయి•నే, తనలెంకల రాచదండ్ల నం
దఱఁ దనయత్తినించె, నిల•దారి నెఱేంగని, కేల్లఁ గాళ్ళనే
ర్తెఱ నిలరాల్చి చేక్కఁడఁచెఁ•దిన్నని గాల్చెలి నారసాననే.

టీ—అఱ...సానన్=అర్ధచంద్రబాణముచేత, అత్తిన్=గొంతునందు, గాలి+చెలి=గాల్చెలి...నే=వాయుసఖుఁడైన అగ్నిబాణముచేతనే

క॥ తనకంటెఁ జిన్నతండి
ట్లణఁగిన జోడఁ దనలెంక • లాడఁగ నాలిం
చి, నలం ద్రాగెడి తెగతేఁ
డణఁగితె యని యతని గలఁచి • యడలి కడంకన్. 75

—• అతికాయాదులవధ. •—

సీ॥ త్రిశిర! నరాంతకా! • త్రిదశాంతకా! యతి
కాయ! యీాదం, డ్లిర • లీయెడఁజని,
నేలరాయలఁ, జెట్ల • నెఱేఁదిరిఁగెడిజెట్లఁ
జెక్కాడి రండని • నరగ నంచె
దా రింక నిద్దఱఁ • దగజెంటగాఁజేర్చి
తనరారఁగా, నర • దాలనెక్కి,
యనినేల కఱేఁగిన • నాదండ్ల కీదండ్ల
కింతంతయనరాని • యేడ్తెరమ్యె,

తే॥ తేనిదండ్లంత రాకాసి • తేనిదండ్ల
గట్లచేఁ జెట్లచేఁ జెండి • కడఁకఁ, దక్కి-
నాన, గల్గినజేజేల • తేనిచెంత
కంచె నిత్తిగ రక్కసీం • డ్రిలిగి కిసిసి. 76

టీ—ఈరలు=మీరు, నేలరాయలన్=రామలక్ష్మణులను, ఏడ్తెర=యుద్ధము, దక్కినము=దక్షిణశబ్దభవము, దక్కి...చెంతకున్=యమునికడకు, ఇ+తిగ=ఇత్తిగ=రెండుమూఁడులారు.

క॥ రారాయని దండ్లందఱ
నారాచా, లీఁటెతెగల • నాఁటికలఁచి, గం
డారంగా, నల్లమొదలఁ
గారంగాఁజేసి, చెదరఁ • గాఁ జేయంగన్. 77

టీ—రారాయని=రాజరాజైన రాముని యొక్క, నల్ల=రక్తము ఎదలన్=రొమ్ములనుండి.

తే॥ ఐంద్రికం, డీదకం, డల్ల • యగ్గికం డె
దిర్చి యిత్తిగ రాకాసి • దిట్టలెదలఁ
గాడఁగాఁజేసి చెట్లచేఁ • గట్లచేతఁ
గడ కడంచిరి కడిఁది రా•కాసిఁదక్క. 78

టీ—ఐంద్రికందు=ఇంద్రపుత్రుడగు వాలికొడు కంగదుఁడు, ఈదకందు=వాయుపుత్రుఁడు, అగ్గికందు=అగ్నికొడుకు నీలుఁడు, ఇత్తిగ=ఆరు, కడిఁది రాకాసి=అతికాయుఁడు, అనగా నంగదుఁడు, హనుమంతుఁడు, నీలుఁడు రక్కసులార్గురిలో నతికాయునిదక్క మిగిలిన వారి నడంచిరని తాత్పర్యము.

—• అతికాయుని నిందాస్తుతి. •—

శా॥ అంతం జిక్కిన రక్కసీఁ డలిగి త • న్నం, దేర్చుగల్ రాచేదం
డంతం జిక్కక యేగఁగా గలఁచి డా • యంజేరి రాతేని, ని
గ్గంతం డా, ననెంచితేఁడ! యతికా•యా! యన్న, జేజేలదం
డంతం దాయఁగరాకయేగ నిఁక నీ • దైనట్టి దండ్లేటికిన్. 79

టీ—చిక్కిన...సీఁడు=మిగిలిన యతికాయుఁడు. తేఁడ!=రామా!
(ఓజగత్ప్రభూ)

క॥ నాతిని జెనకితినని నల। తాతినిఁ జెలిఁజేసితినని ♦ రక్క_సిరా సం
గాతిని జెండితినని నా। చేతినిఁ జిక్క_, కని, తిచేఁటఁ ♦ జేరి తనకికన్. 80

టీ—నాతిని=తాటకను,నలతాతిని=నల్లని రాయియైనయహల్యను, రక్క...తిని=రాక్షసరాజగు రావణుని చెలికాఁడైన మారీచుని;

క॥ జేడిసి యిలఁ గైకకన్న। ట్టిడి, కిడి; చెలిఁ దాయకిడి, చె♦ డినడెందానన్
నడికానల నడయాడక। కడిది యెఱచిదిండ్ల, నేల ♦ కదలించి తిఁటన్. 81

టీ—కై క...ట్టిడికిన్=భరతునకు, ఇలన్=భూమిని, చెలిన్= సీతను;

ఉత్సాహ॥ తాతకైనఁ గానరాక ♦ దాగి జేడలదార్ల, ని
న్నేతలంచి నతని గస్తి ♦ నిండఁజేసి, జేడల జేఁ
జేతఁ దాల్పఁ జేసి కల్ల ♦ చేతఁ దిరిగి, సన్నయే
జ్ఞాతియేని లేని దణికి ♦ సన్న చిన్నె కల్గెనే? 82

టీ—తాతకైనన్=బ్రహ్మకైన, కస్తిన్=కష్టమును, కల్లచేతన్ మాయచేత, దణికిన్=ప్రభువునకు, సన్న=పేరు, చిన్నె=మంచిలక్షణము

సీ॥ కడలిని డాగిన; ♦ గట్టండఁజేరిన,
నిలగాన కణిగిన, ♦ జేడలఁగనినఁ,
దక్కరియై నానఁ ♦ దక్కికైసాచిన,
నేలజేజేలండ ♦ నిలఁగఁ గనినఁ,
గానలఁజేరిన, ♦ కడ కాలఁగాచిన,
నడలి కడింది చె ♦ ట్టం దిరికిన,
జక్కినెక్కినఁ, గల్కి ♦ చానయై తిరిగిన,
నేరికి గనరాని ♦ యెడ, నడరిన,
తే॥ నెఱిని నాయెద నీయంద ♦ నే నిడియెద
నెర, నిగా చేత నెల్లెడ ♦ నిన్నరసెదఁ
గాన నీయాఁట లిచేట సా ♦ గంగనీయ
నిలఁచియనిజేయఁ గడఁగింక ♦ నేలరాయ! 83

టీ—కడలిని డాగినన్=సముద్రమునదాగిననని నింద, అనగా, మత్స్యమూర్తివైనవని స్తుతి, గట్టు+అండన్+చేరినన్=కొండక్రిందడాగిన ననినింద, కూర్మస్వరూపుడవైన ననిస్తుతి, ఇట్లంతట నరయఁదగు.

క॥ అసినంత నేలతేఁ డా। తనియెడలం జోలఁ గినిసి • తక్కరికాఁడా
అనికడలి రిత్తకబదలఁ। జెనకితె యం చూడి కేల•సింగిణిఁదాల్చెన్॥84

టీ—అసికిన్=యుద్ధముకు, అడలి=భయమంది, రిత్తకబదలన్=వట్టిమాటలచే.

ఉ॥ లచ్చన యడ్డగించి కయి•లచ్చి సెలంగఁగఁ గేలిసింగిణి
న్రిచ్చర నారసాల నిడి • నారిని లాగి నిగిడ్చి, దాయయం
దెచ్చిన కిన్కచేఁ గలఁచే, • నెక్కటిరక్కసి నారసాలఁ దా
నెచ్చిలి రాల్చి, చిల్కడర • నేసి, కలంచి, యలంచె లచ్చనన్॥85

టీ—లచ్చన=లక్ష్మణుఁడు, కయిలచ్చి=బాహుసంపద, ఎక్కటిరక్కసి=ఒక్కఁడైనయతికాయుఁడు.

పంచచామరము.

అలంచే, దిట్టయైనరాయ • డంతఁదేరి, రక్కసీం
గలంచెఁ జిచ్చర ల్లెడందఁ • గాడనేయ, రక్కసీఁ
డలంచ దాని, జింకదారి • యల్లెదిర్చియేయఁగాఁ
గలంచే, నింగి, కేగి, తాఁకి, • కాలి, రాలె, రెండిలన్॥ 86

టీ— రాయఁడు=లక్ష్మణుఁడు, రక్కసిన్=రాక్షసుఁడగు నతికాయుని, చిచ్చర + అల్లు=ఆగ్నేయాస్త్రము, జింకదారి=శివుఁడు, ఆయనసంబంధమగు, అల్లు=పాశుపతాస్త్రము.

సుగంధి॥ అంత, రాచేదిట్ట తాత•య ల్లతం డడంగఁగా
నింత సింగిణిం గదించి • యేయ నద్ది కాల్చిళం
కింతయేనిలేక తాఁక • నీఁటెఁ దాచె రక్కసీఁ
డంత నద్ది యీఁటెఁ గాల్చి • యచ్చెనంటి రాలిచెన్. 87

టీ—రాచేదిట్ట = రాజధీరుండు, (లక్ష్మణుఁడు) తాతయల్లు=బ్రహ్మాస్త్రము.

## —• ఇంద్రజిత్తు యుద్ధము •—

చ॥ అని, తెఱఁగెల్ల లెంక లన • నక్కడ రక్కసితేఁ, డెఱింగి, యిం
తని, యనరాని కస్సిఁగన • నక్కట! చేసితె తాత! యం,చేడ
ల్గని, తన, సంతెడంద, నిడి • గట్టిగ నేడ్చినః సింద్రజి,త్తడ
ల్గని తనతండ్రిఁ దేరిచి జే•గాజిగిఁ గ్రాలఁగ నగ్గిఁ దెల్చినన్. 88

టీ—అని తెఱగెల్లన్=యుద్ధ ప్రకారమంతయు, అక్కడన్=లంకలో, రక్కసితేఁడు=రావణుఁడు, తాత=విధి!, తన సంతున్=సంతానమైన అతికాయుని, తేరిచి=ఓదార్చి, అగ్గి=అగ్ని.

సీ॥ ఆయగ్గి జన్నిగ ♦ ట్టల్గియఁ గైదాల్చి
సాహిణికై నేసి ♦ సరస నిడిన
తేరెక్కి, కలనికిఁ ♦ దిన్నఁగాఁజేని, చేద
లంటి, రాదండ్ల గం ♦ డంత నడచి
నారసాల్ సింగాణి ♦ నాఁటి నారిని లాగి
తాతకందెద, సత, ♦ దచ్చి; నల్ల
దారిరా కందెద ♦ దాకరెం; డైదింటి
నైంద్రికందెడద; నై ♦ దార్ల గాలి
తే॥ కందెదం; జాయరాయని ♦ కందెడంద
గిత్తసన్నంగలానెద ♦ గినిసియన్ని
యన్ని, కఱకైన నారసా ♦ లలర నాటి
రానెలలఁ దాత చిల్కేసి ♦ రహిసినార్చె. 89

టీ—ఆయగ్గి=ఆయగ్ని, జన్నిగట్టు=బ్రహ్మసంబంధమైన, అల్గు=బ్రహ్మాస్త్రము, కలనికిన్=యుద్ధమునకు, చేదలంటి=ఆకాశమునకేగి, రాదండ్ల=రాజసైన్యములను, తాతకందు=జాంబవంతునియొక్క,ఎదన్=ఱొమ్మున, సతదచ్చి=(7×8=56) ఏబదియారు, నల్ల...దెదన్=నీలుని ఱొమ్మున, ఐంద్రికందెడదన్=అంగదుఱొమ్మున, గాలికందు=హనుమంతునియొక్క, చాయ...కందు=సుగ్రీవునియొక్క, గిత్త...నెదన్=వృషభునిరొమ్మునందు.

శా॥ ఈలాఁ గాచెలి దాయజాతినెలలన్ ♦ హేచ్చైన దండ్లం, గడల్
చాలంగా నదరంగ నేలనిడి, యా ♦ చాలత్తె రాకాసికం,
దాలానం జెరఁగంగనైన దటఁ, ద ♦ న్నగ్గించేఁగాఁ దండ్రికిం
జాలంగా నని, తెంకిఁజేరె; నిట ని♦చ్చెం ద త కం దంతటన్॥ 90

టీ—చెలిదాయ=సూర్యునియొక్క, జాతినెలలన్=వంశచంద్రులను, కడల్=దిక్కులు, చాలత్తె ... కందు=ఇంద్రజిత్తు, ఆలానన్=యుద్ధమందు, తాతకందు=జాంబవంతుఁడు.

చ॥ అలఁతల నార్చఁగాఁ దగిన ♦ యట్టి జెగా యిలదారి, గాలికం
దలయకతేఁగ దాన, నిల ♦ నల్పటఁ జెందిన రాచదండ్ల, రా
నెలజేతఁ దేర్చె; నయ్యెడన ♦ నెట్టన రాయనిఁ జేరి, యార్కి, రా
నెల! యిఁక లంకరాయఁ డని ♦ నేలఁ గనం డెదనేర్చ నంగదల్॥ 91

టీ—ఇలదారి=భూధరము, (సంజీవికొండ) రానెలజేతన్=రామలక్ష్మణులను, ఆర్కి=సుగ్రీవుఁడు, అంగదల్=కష్టములు.

శా॥ కానం, గిత్తిడి లంకఁ గాల్చ నతఁ డా ♦ కాలంగనైనట్టి లం
కానం జేలక దండ్ల నిం దనిచి, తా ♦ నంతంత నేతెం చేనం
గా నం తం, దన దండ్ల తేఁడనిచె, నా ♦ కాల గ్లఁటం గిత్తిడం
గా నంతం దెగఁగాలె లంక; యడఁ గం ♦ గన్ సన్న కాంద్రా యెడన్ 92

టీ—కిత్తు+ఇడి = నిప్పునుంచి, లంక+ఆనన్+చేలక = లంకను బొందనేరక.

క॥ ఏఁటికి సీతం దెచ్చె ని । కేఁటికి రాజేనిఁ దాఁకె ♦ నేడ్తెర నకటా!
నేఁటికి సీతసి దెలిచినఁ । గాఁటికిఁ జేరఁదగెనని సెకంజెచ్చిరఁటన్. 93

టీ—ఏడ్తెరన్=యుద్ధమందు, నేఁటికి=ఈ దినమునకు, తెలిచినన్ కొలిచిన.

శా॥ డెందానం గలకేర్చ నంతఁ దనకం ♦ టెం జిన్న రాకాసి సం,
తందానం గని యన్నలార! యనియం ♦ దయ్యాం, దగం, రాల్చి,యం
తం,దానం గడ తేరియేగ కిట నిం ♦ డ్లం గాల్చనై, రెల్లరీ
చేందానం, గలఁగించి రండనియనెం, ♦ జేలర్తిరా దాయలన్. 94

టీ—చిన్నరాకాసి సంతున్+అంచానన్+కని = చిన్నవాఁడగు కుంభకర్ణుకొడుకులను జెక్కఁగాజూచి, అయ్యన్=మీతండ్రియైన కుంభకర్ణుని, చేలర్తిరా=పంక్తిశిరుఁడగు రాజును.

మ॥ అనినం దా రజదాలనెక్కి, నెజస ♦ ర్లాలేళ్ళఁ జెక్కాడఁగాఁ
జెనిన ట్లాయిలతేని దండ్ల, నని రా ♦ ల్చెం జేరి, రాదండ్ల కి
ట్లని రిక్కాడలఁ గాయ లేరితిని తిన్న ట్లం, దడంగంగ లే
కని, దాయల్ కయిరాల నేల? నకటా! ♦ యానల్ దెగంగా నిటన్.

టీ—నెజసర్లు=సింహములు, రాదండ్లన్ = రాజసైన్యములను, అందున్=ఆయడవులలో, అకంగంగ లేక=చావలేక, (అక్కడచావలేక యని విసుగుతోనన్నట్లు) కయిరాల నేల=చేతిలో జచ్చుటెందులకు!

క॥ తన యాలికిన్నై యీరలఁ। దనజేతగా, నడఁచేఁదలఁచె♦దండ్లారా! ల
చ్చ్ఛనయన,'జేతలేనిదిచేంఁ।జేనఁ డిలతేఁ'డనెడి సడియె♦సఁగనిలలేదా?

టీ—లచ్చ్ఛనయన=లక్ష్మణునన్న రాముఁడు, ఆలికిన్నై=భార్యకై, "జేత......తేఁడు" రాచేవాఁడు తోఁకులేక చేవఁబోఁడు, అనెడి సడిన్=అను సామెతయొక్క చెప్పుడు ఇలలేదా=భూమినిలేదా?

సీ॥ చెకచెకజేని యెక్క ♦ సన్నికఅచెట్ల
గట్లదీటెడి హత్తి ♦ దాట్లెకాని,
యెనఁగన రహినాడి ♦ చెనక జింకలదండ్ల
గాలి నెన్నఁగలతే ♦ జీలకాని,
గరగరఁ దిననెక్కఁ ♦ గల ససి చే ల్లట్ల
తిన్ననైన కడాని ♦ తేర్లెకాని,
చెరచెరఁ జేనిదాఁట ♦ నెరనీటి జాల్దార్ల
కడలేని నల్లజే ♦ క్కఅలకాని,
తే॥ రేగి యాలించెతెక్కడా ♦ రితెగ సద్ద
సారె తెర్రించెలాగినారి ♦ సద్దెకాని,
కాన నీరేడ? రాకాసి ♦ కల నదేడ
చేక నిల్చెదరెటకైనఁ ♦ జేన్నసన్న॥ 97

టీ—గట్లన్=కొండలను, హత్తిదాట్లె=హస్తి (ఏనుగుల) సమూహములే, ససి=పైరు, నీటిజాల్దార్ల=నీటికాల్వలు బోవుదారుల, ఈరేడ=మీరెక్కడ? కలను+అది+ఏడ=యుద్ధమెక్కడ? చేక=చేవక, సన్నన్=తిన్నఁగా, చేన్నన్=వెళ్ళిన.

మ॥ అనిలేలెం, డిలతేనిదండ్లతెగ, గం ♦ డారంగ నారంగ, నీ
యని రారా జెదిరించినం జెనర కీ, ♦ రాగంగ రేగంగ, తేం
డ్రి నిగాగా, నెదిరించె, రార! యని దం ♦ డ్లం రేచి తారేచి, నిం
గిని, జేజేల్ గన నీఁటెలం గలఁచి రా ♦ గిట్టల్ నెరాజెట్టలన్॥ 98

టీ—గండు + ఆరంగన్=గండుతన మొప్పునట్లు, ఆరంగన్=నాశనముకాగా, రారాజే=రాజరాజే, (రాముఁడు) ఈరు+ఆగంగన్=మీరడ్డగించేగా, అనిన్=యుద్ధమందు, తేండ్రు=రాజులు, (రామలక్ష్మణులు) రేగంగన్=విజృంభింపఁగా, తారు=వారు, ఆగిట్టల్=ఆచిన్నవాండ్రు.

స్రగ్విణి॥ అయ్యెడం గాలికం • దార్కి యాయిద్దఱిం
జెయ్యనం దాకి యే • చెంగఁ జేగట్లచే
డయ్య గట్లన్ని చెం • డాడ రాకంట్లఁ గ
న్నయ్యనే చేర్చిరా • యయ్యలే చెట్లచే॥

టీ—గాలికందు=హనుమంతుఁడు, ఆర్కి=సుగ్రీవుండు, ఆయిద్దఱ్=ఆకుంభకర్ణు కొడుకులిరువురను, గట్లన్ని=కొండలన్ని, డయ్యన్=అడంగఁగా, ఆయయ్యలు=ఆ హనుమత్సుగ్రీవులు, రాకంట్లన్=రాజవిరోధులగు నా రాక్షసులను, చెట్లచేన్=వృక్షములచేత, కన్నయ్యన్+ఏ=కన్నతండ్రి కుంభకర్ణుని జేరునట్లు.

## —* మకరాక్షుని యుద్ధము *—

ఉ॥ అత్తెఱఁగ్గల్లఁ జో త్తలల • యాతని కాతని లెంక లాడఁగా,
నత్తఱి నాతఁ డింత యెద • నంగదఁ గాంచి కడంక నీటిరా
తత్తడి కంటి రక్కసిని • దాయల నార్చఁగ నాడి యంచెఁగా,
దత్తడి, హత్తి, లెంక తెగ • దండన రాఁజెనె నాతఁ డన్కికై. 100

టీ—ఎదన్=మనస్సునందు, అంగద=కష్టము, కాంచి=పొంది, నీటి...సిని=అప్పతి (వరుణుని) యొక్క గుఱ్ఱమైన మొసలికన్నులవంటి కన్నులుగల రాక్షసుఁడు, అనఁగా మకరాక్షుఁడు, దాయలన్=శత్రువులైన రామలక్ష్మణాదులను; అన్కిన్+ఐ=యుద్ధమునకై, ఆతఁడు=ఆ మకరాక్షుఁడు.

చ॥ ఛేని, నెఱినారసాలఁ దన • చైఁగల సింగిణిఁజేర్చి, నారిఁగా
గి,నిగిడి తేనిదం డడలి • కేకల తేనిని జేర నేసి, రా
యని దరికేగి, జంక కనె • నక్కట! రాయఁడ! సన్నకాండ్ర, నాఁ
డణచితి నంచేదం జెలఁగ • కయ్యది నాదరి సాగిరా దికన్. 101

టీ—తేనిదండు=రాజసైన్యము, అడలి=భయమంది, కేకలన్=కేకలచేత సన్నకాండ్రన్=కొద్దివాండ్రను, నా. దరిన్=నా చెంతను.

సుగంధి॥ డాఁగి యేయ నైద్రినిం, గ•డాని దన్ను యాసనాఁ
డాఁగి యేర్చ లేడినిం, గ•యాళియం చెడంచె ని
న్నాఁగి నట్టి తాటకం, గ•యానకై యెదిర్చి నీ
సాఁగి యేగనీని రాచె • జాతిదాయఁ గా నిదే. 102

టీ—డాఁగి=చెట్టుచాటునఁబొంచి (వాలిపొందిన, శివుని వరము ప్రకారముగా, నెదుటనిలిచి యుద్ధముజేసిన వాలికి సగము బలమీయ వలసివచ్చునని డాఁగి) ఐంద్రిని౯=వాలిని, కడానిది=బంగారు చాయగలది గయాళి=గయ్యాళి యొక్క రూపము, కయానకై=కయ్యానకై (యుద్ధమునకై) రాచజాతిదాయ=పరశురాముని, కాను=కాను.

క॥ అని నిన్నడఁచెఁగ నేతెంచిన రక్కసి నెఱసరి, నని చెదర కెత్తిగి న
న్ననిఁ గెల్చితేని నెఱసరి యనియొకనని నారిలాగి యల్లతఁ డేసె౯.

టీ—రక్కసి నెఱసరి౯=రాక్షసశూరుండవని, అల్లు=బాణము.

ఉ॥ ఏసినఁ గిన్ని సింగిణిని నెక్కటి చిల్కొడి, నారిలాగి, తేఁ
డేసిన రక్కసీఁ డును దేలికె చిల్కుడగించి, నారసా
లేసిన రాయఁ డన్నిఁటిని నెక్కటి చిల్కుడిరాల్చి, చిన్న రా
కాసిని డాసి సాహిణిని గ్రచ్చర హెచ్చుడి దాన రాలిచె౯. 104

టీ—సింగిణి=విల్లు, ఎక్కటి=ఒక్కటి, సాహిణి=రథముతోలు వాఁడు.

ఉ॥ రాలిచి, తేరిడాల్నెర, సరాత్రైగ నేలనరాల్చి, చించితే
జీలఁ, గడింది గాలిచెలి చిల్కుడరించి యడంచె రక్కసి౯,
రాలక, చెంతకంతఁజేని రక్కసిలెంక లదెల్లఁ జొత్తలల్
గ్రాలఁగఁదాల్చినాతనికిఁ గాదన కాడి రెడందఁ గందగ౯. 105

టీ—తేరిడాల్=రథముటెక్కెము. గాలిచెలి=వాయుసఖుఁడైన యగ్ని యొక్క, చిల్కు=బాణము, అనగా నాగ్నేయాస్త్రము.

—* ఇంద్రజిత్తువధ *—

క॥ దరి గనని యాఁగడల చాఁలటి తింగల యెరచిదిండి యంతటనెంతే
దెఱఁగంటి ఱేనిఁ గెలిచిన సెరజాణం జేరఁజీరి నెఱి నిట్లనియె౯. 106

టీ—చాఁలటి...దిండి=సంక్తిశిరుఁడను మాంసభోజి, తెఱ......జాణ౯=దేవేంద్రుని గెల్చిన మేఘనాథుని, చీరి=పిల్చి.

చ॥ చెక్కనికండ! నిన్నుఁ కిఁ జేయ్యవ నంచెద నన్ను నాయెదం
డ, క్కడ రెంగదయ్య!, యని దక్కక నీవినతండ్రి దేఁగఁగా
నక్కట! నే, నెటూరనిన, నంచేక తీర దిఁకేది చేసె, డా
చెక్కనితేండ్రిఁ గండడఁచి చేయ్యనఁ జేరగదయ్య టెంకికి౯. 107

టీ__నీచినతండ్రి=నీచిన్నతండ్రియైన కుంభకర్ణుఁడు, లెంకికిన్= లంకకు.

క॥ అనియెడఁద హత్తితండ్రీ! యనిఁగెలిచె,ది కేలయేగ•రా! యనఁగా నా
యన చెనరని కడఁకంజే యన్నఁ దండ్రి కెఱంగి దండ్ల•నడరిచియనికిన్.

టీ__ఎడఁదహత్తి=అోముత్రీన కదుముకొని,ఎఱంగి=నమస్కరించి.

చ॥ కలఁగని కత్తలానిజేతఁ • గట్టిన, గట్టి కడాని తేరిని,
స్నలఁ గని సింగిణీలఁ, గల•నంగెలియం దగినట్టి నారసాల్,
కలఁచినఁ జన్గకే తనరఁ • గ్రాలెడి యంగినిజేర్చి, తన్నెదం
దలఁచిన యంత సాహిణి త•నర్చిన, తేరిని నెక్కియాఁదటన్. 10

క॥ తత్తడి తెగనకిలింతల్, హత్తి తెగల్ కేక, లెల్ల • యఱదాల్సడి, రే
కెత్తి నెఱదండ్ల కేకల హత్తి, కడల నింగిఁజాల•నడలఁగఁ జేయన్.110

టీ__హత్తి=ఏనుగు, (హస్తిశబ్దభవము) హత్తి=కలిసి, కడలు= దిక్కులు.

క॥ తాలిచిన నగఁ జిగి, యడిదాలజిగిం గలిసి నింగి•వరిసి నెఱెనిదాఁ
గ్రాలఁగఁ దెఱఁగంట్లఱగం ట్లెలిఁజెలఁగంగ నింగి•యఱదాల తెగన్.

టీ__నింగి= ఆకాశము, తేఱగంట్లు = అనిమిషులు, అఱగంట్లు+ అయి=సగముకన్ను మూయఁగా, ఇంద్రజిత్తుధరించిన యాభరణములకాంతి మిరుమిట్లె రెప్పవ్రాల్చి, నింగి... తెగన్=ఆకాశవిమానములయందు.

క॥ అసికేగడి తన్గని చా యున్న నటఁగల యట్టిరితఁ డ•హల్యనెనసి నా
తనిజీరఁగ, నెలదారిసి జెనకఁ జెనెడి చెక్కునయ్య•సిరి జెనెడినన్॥

టీ__అహల్యనెనసినాతనిన్=అహల్యాకాముఁడైన యింద్రుని. నెల...సిరిన్=చంద్రధరుఁ గెలువజేను మన్మథు విభవము చేత.

సీ॥ ఇంద్రజిత్తునికి సిం•గ్లైగి యుయ్యలకెన్న,
జాలచెంగటి కాఁటి • నేలకఱఁగి,
యెదిరిఁజేరఁగనీక • యెల్లకాలరితెగ
సరగఁ దన్నన్ని దో•సలన కాయఁ
దిగతల లలరంగఁ • దిన్నియ నలంరించి
దానియందగ్గిని • దరియఁజేసి
యెఱనల్ చేలల • నెఱిఁదాల్చి తలకాయ
నిలచి యెఱచి, నల్ల•నేయి తాఁడి

గీ॥ కట్టె ల గ్గినినిడి "కడ•కత" నని నల
దారిరాఁదెల్చి యగ్గించెఁ • దడయకంద
కలిగెఁ గల్లరి స త్తి జే•గా,లడలఁగఁ
గలిగి తనచేతనాతని • నలినడిగిన 113

టీ___అయ్యిలకుఁ=ఆయుద్ధభూమికి, కాఁటినేలకుఁ=ఒలికిమిట్టకు, కాలరితెగ=భటసమూహము, తలకాయల నిలచి = తలక్రిందికి బెట్టి కాళ్లు పైకుంచి నిలువఁబడి, ఎఱచి=మాంసము, నల్ల=నెత్తురు, కడకతఁ+అని =అధర్వణవేదమునుపఠియించి, నల=నల్లరూపాంతరము, నలదారిరాఁ= నల్లనిమార్గముగలయగ్నిని (కృష్ణవర్త్మ ప్రభువు) కల్లరిసత్తి=మాయాశక్తి, తనచేతఁ=తనపనిని,

తే॥ ఇంద్రజి, త్తైదసంతసి • ల్చేచి దాని
దనజేతనఁజేర్చి నింగికి • దాఁటి కడిఁది
నేలరాదండ్ల నెవకిన్క•నిండఁ గలఁచె
నారసాల్జడి జేడినీఁటి • దారి, దారి. 114

టీ___ఇంద్రజితు=మేఘనాథుఁడు, దానిఁ=ఆశక్తిని, నారసాల్జడిఁ=బాణవర్షము చేత, జేడినీఁటిదారి=వర్షాకాల మేఘము, దారిఁ= వలె, లేక వరుసగ.

చ॥ కలఁచిన, రాచేదండ్లడరి • గట్లతెగం జెద, లంట నేసి, చే
ల్తలల గమాళికం దెడఁదఁ • దాఁకఁగ నేయఁగలేక, రా, నతం
డల యిలదార్ల నన్నిఁటిని • నా మొడ రాలఁగఁజేసి, నారసా
లలరఁగ నాఁటె రాచనెల•లం దలరాయని దండ్లయందఁటఁ. 115

టీ___గట్లతెగఁ = కొండలగుంపును, చేదలంటఁ=ఆకాశము దాఁకఁగా, చేల్త...కందెడఁదఁ=ఇంద్రజిత్తు హోమక్రనందు, అల... నన్నిఁటిఁ + = అభూధరము (కొండ) లన్నిఁటిని, రాచనెలలందుఁ= రాజచంద్రులందు.

చ॥ సడలక నేల తేఁడతని • సత్తిని, నాతనిచిన్న తండ్రిచే
నడర నెలింగి, నింగితల • యాతని చిక్కడి, దాయసత్తినిం
గడఁక నడంచె, దాయ యిలఁ • గ్రచ్చఁబడి డిగ్గి కడింది యీనిచం
జెడర చెలంగఁగా నడిచి • చెచ్చెరరాయని దండ్లదాసి రా ఁ. 116

టీ—నేలతేఁడు=భూభర్తయైన రాముఁడు, అతనిసత్తిక=ఇంద్రజిత్తు మాయాశక్తిని, అతని చిన్నతండ్రిచేఁ=వానిపినతండ్రి విభీషణునిచేత, సింగితలయాతని=ఆకాశకేశుని (శివుని) యొక్క, విల్కు=పాశుపతమును, దాయసత్తినిక=ఇంద్రజిత్తు శక్తిని, డాసి=దగ్గరఁజేరి.

శా॥ సన్నక గల్గిన దిట్టలందఱు నెఱా • సత్తిం జెడక నారసా
లెన్నక నాఁటిన, నంతఁ దాచె నెలదం•డింతంత తాల్ చెట్లచేఁ
దిన్నంగాఁ దననారసాలుఁ ద్రుంచి యెం•తేనార్చ, రాదాయ, ల
చ్చెన్నుం, దండ్లఁగలంపి యాఁటియల నా• ర్సలం, జెగాసత్తిచేఁ.

టీ—సన్నక...దఱిఁ పేరుగల్గిన ధీరుఁను,తాల్ చెట్లచేక=తాళ్ళు చెట్లచేత, రాదాయ = రాజశత్రువు (మేఘనాథుఁడు) జెగాసత్తిచేక= శ్రేష్ఠమైన శక్తిచే.

ఉత్సాహ॥ కాఁటినేల కఱిఁగి, తిఱిఁగి • గాలినేస్త కానినిక
నేఁటలంగఁ దెలిచియగ్గి • నెఱియఁజేయ నల్గడల్
గాఁటియగ్గి యేర్చఁగాంచి • కడఁక నతని చిన్నతం
డ్రిఁటికింక నితనికడఁక • యింతనెగ్గ నీతనిక. 118

టీ—గాలినేస్తకానినిక=అగ్నిని, అతని చిన్నతండ్రి=విభీషణుడు, ఇతనికడక=ఈయింద్రజిత్తు ప్రయత్నము, నెగ్గక=నెరవేరిన.

ఉత్సాహ॥ తాతయేని యని నెదిర్చి.• తాఁకఁ జాలఁ డన్న, నా
సీతరాయఁ డంతఁ గడిఁది • సింగిణీల నారసాల్
చేతికిచ్చి, దండ్లఁ జెంతఁ • జేర్చి, దాయనార్చి రా
నా, తఱిం, గడంక నంచె • నండఁ గన్న లచ్చనక. 119

టీ—తాతయేని=బ్రహ్మయైనను, దాయక=మేఘనాథుని,

—• లక్ష్మణ మేఘనాథుల యుద్ధము •—

చ. అనిచిన నేఁగి రేచెఁ దన • యండనకల్గిన దండ్లఁ, దారటం
జేని, చినరక్కసీని నెఱ•జన్నియ యగ్గిని నార్చి, దాయదం
డణఁచిన, నాతఁ డేఁచి తన•యండన కిన్న రేచె దండ్లయం
దణఁచిన, నాగ కక్కడలి • యగ్గికిఁ దీఁటుఁగ గ్రోలి సింగిణిక. 120

టీ—రేనెక=కవ్వించేఁగా, తారు=దారు, చినరక్కసీని=చిన్న రాక్షసుని (మేఘనాథుని) యొక్క, జన్నియ =యజ్ఞసంబంధమైన, అగ్గిని=అగ్నిని, కడలియగ్గికిక=బడబాగ్నికి.

క॥ కలుకైన నారసాల । మ్ములఁ జేరిచి నారిలాగి • నిండారంగాఁ
జెలుకెల్ల హ_స్తితనకై । నలుకినజేత నలుకె నేల • రాయని దండ్లన్.

టీ—హ_స్తి=ఏనుఁగు, తనకై =తనతొండముతో, నలికిన జేతన్= నలికినకరణి.

క॥ అంతట లచ్చన నెదిరిచి । యంతటఁగాడ నడిదాల • నాయన నేయం
గ్రంతల నలరఁగ రక్కసి । జంత, యెడద, తేఁడ, నార • సాలన్నాఁటెన్॥

టీ—అంతటన్=తరువాత, అంతటగాడన్=శరీరమంతట నాటు నట్లు, తేఁడ=రాజగు లక్ష్మణుఁడే, నారసాలన్=బాణములను.

ఉత్సాహ. సారె నారసాలఁ దరక • సానదీసినది, జగా
తీ, రెసంగ సింగిణిం గ • దించినది, కడంక నిం
డార నారిలాగినది, త • డాల్చ దాయ గండెదం
జీర నేసినది, తెలియక • సింగిణీల్ కనం దగన్. 123

టీ—సారె=తేపకు, తరకసానన్=అంబుల పొదినుండి, చీరన్= చీఁకొని పోవునట్లు.

ఉత్సాహ॥ తేరి కండ్ల కరణిఁగ్రాల • దిట్టలైన తా, రనిం
దేరి కనెడియట్టిరికిఁ గ • దించి కంటి సంతసాల్
చేరి కడిఁదిరిక్క రక్క • సీఁ, డతనికి దాయలై
చేరి కలిగి నతని కరణిఁ • జేసి రనిఁ జెలంగఁగాన్. 124

టీ—తేరికండ్లకరణిన్=రథచక్రములవలె, అట్టిరికిన్=అటువంటి వారికి, కంటిసంతసాల్=నేత్రసంతోషమును, రిక్కరక్కసీఁడు=తారకాసురుఁడు, అతనికి=ఆ తారకాసురునకు, దాయలై=విరోధులై, చేరి రుద్రవీర్యము పార్వతియందు జేరఁగా, కలిగినతనిన్=పుట్టిన కుమారస్వామియొక్క, కరణిన్=విధమున, కుమార తారకులవలె లక్ష్మణ మేఘనాథులు,

సీ॥ ఇంద్రజి_త్తిరచి • లేక్కసిన లచ్చన
తాఁ గ్రిచ్చెల్లడర నేసి • దానినార్పఁ
ద్రించె, ల్లతండేయ • రానెల తెక్కల
గారిరా చిల్కసి • గాసినార్చె,
రాకాశి, తిగదెస • సాయనిచిల్కయఁ
జేయరాచిల్కసి • రాయఁడార్చెఁ

నీఁటిచే రక్కసీఁ • డిలఁజేని దాచినఁ
గత్తిచే రాయఁడా • కడఁకనార్చె,
తే॥ నీకరణి నని నాయిద్ద • జేచి చేయ
నంత లచ్చన కిన్కచే • నంది నార
సాలచే, దాయతేరిని • జెక్కడంచి
సింగిణిం జిల్కడరఁజేర్చి • చెలఁగియట్టె

టీ—ఈదచిల్క=హయాస్త్రము, తాఁచేల్లు=ఉరగాస్త్రము, తెక్క...చిల్క = గారుడాస్త్రము, తిగ......చిల్క=వారుణాస్త్రము, చాయ ... చిల్క = పతంగాస్త్రము, అట్టె=ఆశ్చర్యముగా,

ఉత్సాహ. సీత కడిఁది గరితయైన • సీతరాయఁ డంగదల్
చేతనైనఁ గల్ల ననని • జెట్టియైన నేరి, కీ
చేత, లగ్గె, యిడెడిదైనఁ • జెనఁటిదాయఁ జీల్చెడిం
గాతఁ, జిల్కటం చెదిరి, నిగాఁగఁ గాంచియెద నిడెన్. 126

టీ— గరిత=పతివ్రిత, కల్లన్= అనృతము, అనని=పల్కని, లగ్గె=మేలే, నిగాగన్ = లక్ష్యదృష్టితో, చెనఁటి = చెడ్డవాఁడైన, దాయన్=మేఘనాథుని.

పంచచామరము.

జెగా లడ ల్గనంగ నార• పాని నిట్టిడంగ, నా
జెగా, కడింది చిల్కనంగ • పాఁగియేఁగి, దాయఁ, దా,
నిగా, నడంచి, నేలఁజేరి • నీఁటనాడి, చేన్న, చా
యగాఁదగంగఁ దర్కపాన • నంతఁజేరె నెంతయేన్. 127

టీ— జెగాల్=లోకములు, జెగాకడింది చిల్క=శ్రేష్ఠమైన గొప్ప బాణము, తాన్=తాను, దాయన్=విరోధిని, నిగాన్=సూటిగా, నేలఁజేరి=పాతాళగంగనుజేరి, నీటన్=జలములను, ఆడి=స్నానముచేసి,తర్కపానన్=అంబుఁ పొదియందు.

క॥ అచ్చెనఁటిఁ జెక్కడఁచి చేసి। లచ్చన యన్నకడఁ గలని•లాఁగన నాతం
డెచ్చిలిన పంతపానన్ । లచ్చెన నగ్గించె; జొల్త • లలతేని కఁటన్.

టీ—అచ్చెనఁటిన్=ఆదుర్మార్గుఁడగు మేఘనాథుని, చెక్కడఁచి =చంపి అన్నకడన్=రామునిదగ్గర, అఁటన్=లంకయందు, చొల్తలలతేనికిన్=రావణునకు.

ఉ॥ రాలక చిక్కినట్టిక, రని ◆ రక్కసికందుఁ గాంచి నంపేసం.
జాలక యెట్టకేల, కన ◆ పాఁగఁగఁ గందనగాయ చెక్కలై
చేల, కడంకఁ గంటికడఁ ◆ జేరిచి యింద్రజిత్తే చ్చేసంగ, నా
కేలకడింది లచ్చియని? ◆ యేడిచె రక్కసిరాయఁ డెంతయేఁ. 129

టీ—రాలక=చావక, చిక్కినట్టిక=మిగిలిన రాక్షసులు, రక్కసికందు=రావణపుత్రుడు, కందనగాయ=గుండెకాయ,

ఆ. అంత నెట్టుకేల ◆ కా, చేర్తలలదిట్ట
దిట్టలెల్లఁ దేర్పు ◆ దేరి యెడద
నింత దరిని గనని ◆ యీసేర్చ దనదండ
దండ్లడరఁగ ననికి ◆ దరిసె నంత. 130

టీ—ఈసు=అసూయ, అనికిఁ=యుద్ధమునకు, దరిసెఁ=దగ్గరియెను.

—◆ రావణు ప్రథమయుద్ధము ◆—

మ॥ నెఱిఁగ్రైసేసిన తేరినెక్కి యని కె ◆ తే నాతఁ డప్లేగి గ
ద్దఱిసై కాఁరిదండ్లరేచి, యిలరా ◆ దండ్లం గలం జెడ్డచేఁ
గఱుకై నట్టి పరాల సింగిణిని జేకొం జేర్చి సద్దంతట
న్నైఱియన్నారిని లాఁగి యేసి నెఱిగం ◆ డ్రించెంగ సాగెం దగన్ 131

టీ—క్రైసేసిన=అలంకరించిన, ఇలరాదండ్లన్=రాముని సైన్యమును, గండ్రించెంగన్=ఖండించుటకు. సాగెం దగన్=ఒప్పునట్లు పూనె.

స్రగ్ధర.

చించెం, జేకత్తిచేతఁ ◆ జెదరనెడదలం, ◆ జిద్రులై యేగఁగాఁ, గం
డ్రించెం, జేగాళ్ళఁగీల్లం ◆ దిగిచి నెఱకలం ◆ దెగ్రించి, తల్కాయలం, దెగ్రో
ళ్ళించెం జేగట్ల చాల్ రా ◆ లిచె, దరిఁగనకే ◆ లేచితర్లంగఁ, గా
లించెం జేఁగారఁగాఁ నే◆లిక నెఱపరిరా ◆ లెంకచాల్ నల్లయెంతేఁ.

టీ—ఎడదలన్=రొమ్ములను, చిద్రులై=తుంపులై, నెఱకలన్=వెండ్రుకలను, చేగట్లచాల్=చేతుల కొండలను, ఏలిక...నల్ల=రాజసంబంధులైన శూరశ్రేష్ఠులైన భటసమూహముల నెత్తురు, చేగారగాన్=నఱకినప్పుడు చేతినుండి కారుచుండఁగా, గాలించెన్=వెదకెను.

లయగ్రాహి.

అక్కడిదిచేతుల్లలల♦రక్కసి గయాళి, నెఱ♦రక్కసితనాననెవ నఱక్క
టికలేకే। చక్కడఁచె, నీకరణి♦లెక్కనిడరాకజిగి♦దక్కఁదెగగానయి
నఱత్రెక్క తెగచేతం। జిక్కక చేనంగఁ గని♦తెక్కలియట్లం చేడరి♦
చెక్క, నలగారఁగల♦డెక్కయిన కాళ్ళం। దక్కనియ, కేఁచే, నిల♦
చెక్కతెగతేనిదెస♦కెక్కనయి, రేలికయ♦దిక్కనఁగ లెంకల్. 183

టీ—రక్కసితనానఁ=రాక్షస కృత్యముచేత, అక్కటిక=దయ, తెక్కలి=దొంగ, ఇల...దెసకుఁ=భూమండల భర్తదగ్గరకు.

మ॥ తనదం, డ్లి, ట్లడలంగ రాచెనెల యం♦తం గాలికం దైంద్రికం
దొలేవట్టి కడిందిగట్లఁగయి నెం♦తేఁదాల్చనై, రాగ, ల
చ్చిన సింగాణిని దాల్చిరాగ; గడఁగెం ♦ జేలర్తి రాకాసిదం
డ్లు, నడంగించేఁగ, హత్తి, జెక్కి, దణి, తేర్లం, జెక్కి, చేకాడఁగాఁ.

టీ—తనదండ్లు=తనసైన్యము, ఇట్లడలంగఁ = ఈవిధిభీతిల్లగా, రానెఁ=రాజచంద్రుఁడు (రాముఁడు) గాలికందు=హనుమంతుఁడు, ఐం ద్రికందు=వాలికొడు కంగదుఁడు, జెక్కి=గుఱ్ఱములయొక్క.

స్రగ్ధర.

చెండించెం గత్తిఁగేళ్ళం ♦ జెదరఁగ నడఁగిం♦చెం దలల్నారసాలఁ
నిండించెఁ, గండనల్లల్ ♦ నెఱకలు జెడిగా ♦ నెట్టనం, గారఁగాఁ గీ
ళ్ళం, డించెం గఱ్ఱియీఁటె ♦ లక్కఱకఱనెఱక ♦ ల్గాడఁగాఁ గిట్టియీఁటె
ల్నిండించెం గండనల్ల ♦ న్నెఱి, నిలఁదినఁగ ♦ న్ఱెక్కదార్లెల్లనాసఁ.

టీ—నల్లల్=నెత్తురులు, నెఱకలు=వొడ్రాకలు, ఱెక్కదార్లు=పక్షులు, గిట్టయీఁటెల్=కుఱచయీఁటెలను.

ఉ॥ ఆనటఁ జేతుల్లల ల్గల గ♦యాళి నెదిర్చి సరాల్చన ల్దిస
ల్నాదిక, గాడనేసి తెగ♦నార్చి కలంచి యలంచి చించేఁగా,
నాదడ, రక్కసీఁ డడరి ♦ యయ్యిలరా యడిదాల, రాల్చి, యం
తే,దిగ, నారసాలనెదఁ ♦ దేఁటగ నాఁటి కలంచె నంతటఁ. 186

టీ—చేదల్=ఆకాశము, దెసల్ = దిక్కులు, నాదు+ఇడఁగా=శబ్దమీయఁగా, ఇలరా=భూపతియైనరాముఁడు, దిగఁ=నాఁటగ.

శా॥ రారాయం డడిదాలఁ, జేలఁ, నిడఁగా, • రాకాసి రారాల్చెఁ; న
ట్లారాకాసి నరాల గాడ, నిడఁగా • నాతేఁ డడంగించె, న
ట్లారాయం డలరక్కసీఁ, డసిని జే • యన్ సాగి యేదైన జే
జేరా, రక్కసిరాయలట్ల, యలజే • జేజెల్ల రగ్గించఁగాన్. 137

టీ—రారాయండు=రాజరాజైన రాముఁడును, రాకాసిరా= రాక్షసరాజైన రావణుఁడును, ఏదు+ఐనజేజేరా = శ్వేతవరాహమైనదేవశ్రేష్ఠుఁడు (విష్ణువు) రక్కసిరాయలు = రాక్షసరాజైన హిరణ్యాక్షుఁడు, అగ్గించఁగాన్=స్తోత్రము చేయఁగా.

ఉ॥ ఇట్టనిఁ జేయఁజేయ, నల • యొక్కటి రక్కసి కల్లసత్తినిం
జెట్టన జేనియం, దిడినఁ • జేలఅదాల్గలతేనికం, డెగం
గిట్టి, కడింది తేజెదరఁ • గిత్తడిదాన, నడంచె దాసి; నా
జెట్టిని నడ్డగించి యనిఁ • జేయఁగ లచ్చన తాఁకె రక్కసిన్. 138

టీ—ఇట్టు+అనిన్ = ఈప్రకారము యుద్ధమున, కల్లసత్తినిన్ = మాయాశక్తిని, చేలఅదాల్గలతేనికందు=పఙ్క్తిరథునికొమారుఁడైన రాముని యొక్క, ఎగన్=ఊమ్ముకన, కిత్తు=అగ్నిసంబంధమైన, అడిదానన్=బాణముచేత.

— లక్ష్మణునిమూర్ఛ. —

ఉ॥ తాఁకఁగ రాచెదాయ, యడిదా లడరించిన రాల్చె, నారసాల్
దాఁకఁగనేసి రక్కసి, కతం డట సాహిణిజెక్కిజంట నేల్
దేఁకఁగ రాల్చె, డాలడఁచి • తేరి నడంచినఁ గిన్కరక్కసీఁ
డాఁకడఁ దేరిఁ డిగ్గి, చెయి • యందలి కత్తి నదల్చి లచ్చనన్. 139

టీ—రాచెదాయ=రాజశత్రువగు రావణుఁడు, సాహిణిన్=రథముతోలువానిని, జెక్కిజంటన్=గుఱ్ఱముల రెంటిని, నేల్ దేఁకగన్=నేలరాయఁగా, డిగ్గి=దిగి.

ఉ॥ రెచ్చిల దాఁక లచ్చన దరిం జిగిచేఁ దనకంటెఁ జిన్నతం
డెచ్చిల నిల్చి చిల్కుడఁగ • నెక్కటిరక్కసిరాయఁ డల్కచేఁ
గ్రివ్వర నాలినిం గవిన • రక్కసి యిచ్చిన సత్తి నేయఁగాఁ
జెచ్చెరఁ జిన్నరక్కసిని • జించి కలంచఁగ నద్ది డాయఁగాన్. 140

టీ—రెచ్చిలన్=హెచ్చునుగాంచెగా, లచ్చనదరిన్=లక్ష్మణు దగ్గర, తనకంటెఁ జిన్నతండు=తనకంటె జిన్నవాఁడగు విభీషణుఁడు,

అలినిన్=భార్యయైన మండోదరిని, కనినరక్కసి= కన్నరాక్షసుఁడగు మయుఁడు, ఇచ్చినసత్తిన్=ఇచ్చిన శక్తితో, చిన్నరక్కసిన్=విభీషణుని.

ఉత్సాహ॥ అన్నచేతఁ గాయనైన • యట్టిడిచేట నన్నకై
యన్నచేతఁ జెచ్చెడి నని • యంతఁ జిన్నరాచతేఁ.
డెన్నతని నడ్డగించి • యెదిరిసత్తి తాఁకఁగాఁ
గ్రిన్ననతని నేలఁ జారఁగఁ జేరిగించె నద్దితాన్. 141

టీ—అన్న......యట్టిఁడు=రామునిచేత రక్షింపఁబడిన విభీషణుఁడు, అన్నకై=రామునికొఱకు, అన్నచేతఁ=వానిసోదరుఁడగు రావణుచేత, చిన్నరాచతేఁడు=చిన్నవాఁడగు లక్ష్మణుఁడు, అద్ది=ఆశక్తి, అతనిన్=లక్ష్మణుని.

క॥ లచ్చన్న నేలజారినఁ గ్రిచ్చక, నాలచ్చనన్నఁ • గారించేంగా
నచ్చెన్నఁటి రక్కసితే ;డెచ్చినకిన్కవల నేల•యేలిక యంతన్.

టీ—లచ్చన్న=లక్ష్మణుఁడు, లచ్చనన్న=లక్ష్మణాగ్రజుఁడు (రాముఁడు) నేలతేడు=రాముఁడు.

మ॥ కలకైనట్టి సరాల సింగిణిని జొక్కంజేర్చి చౌఁజిత్తిరాన్
నెఱుకల్ గాడఁగనేయ, నాయనతల•ల్నిండన్ సరా, ల్తాళలే
కజీగెంజెచ్చెర లంకకాతఁ; డిటఁతేఁ • డాలచ్చనంజేరి చె
న్నఱినాకై యిలజారనయ్యెఁగద కట్టా? తండ్రి! యంచేడిచెన్.

టీ—చౌఁజితాన్=పంక్తికంఠుఁడను ప్రభువును, నెఱుకల్గాడఁగన్=వెండ్రుకలుదూరగా, అతఁడు=రావణాసురుఁడు, లంకకున్, అజీగెన్=వెళ్లెను, తేఁడు=రాముఁడు, తండ్రి! నాయనా!.

—* రాముని విచారము. *—

ఉ॥ రాయని, దండఁజేరియన • రాయని, చేక్కని రాచజాతిరే
రాయని, దాయ యెట్టడఁచె • రాయని, దాయనడంచేలేచిరా
రాయని, తల్లికెట్లనెద • రాయని, నా, రతనాలతిట్టకా?
రాయని, దాయనేచేఁగల • రాయని, యెంతటికస్తి రాయనేన్. 144

టీ—రాచజాతిరేరా,=రాజవంశచంద్రా! అని, కస్తి=కష్టము.

ఉ॥ డాయనిదేల? చౌలినతఁ • డా!యని, తిన్నని చిన్నినేలతేఁ
డాయని, నన్నెతెల్చినతఁ•డా!యని, నన్గనకేగ కంద కాఁ

డా!యని, కన్నడించె నగ • డా!యని, నాజెత రాచెరిక్కతే
డా!యని, యన్న కాంచెఁ దగ • డా!యని, యెక్కటిరాయఁడాయనెన్.

టీ—చాలినతఁడా!=సమర్థుఁడా? రాచెరిక్కతేఁడా=రాజచంద్రా! ఎక్కటి=ఒక్కడయిన.

ఆ॥ కన్న తండ్రి యడఁగఁ • గస్తిఁ గానలడాఁగ
గతికతలఁగియేగెఁ • గడ కిటవిల
నిట్టికిస్తిచేరె • నెట్టన నక్కటా!
యిజ్జగాలఁ జేని • నేది యనెన. 146

చ॥ అనియడలంగ, దాశరథి • నయ్యెడ డగ్గరి తారతండ్రి తీ
రనియడలార్చి, తేర్చి, తన • రారఁగ గాలికిఁగల్గినట్టిడిం
గని, యలఁతల్ తలంగ నిడఁ • గల్గిన గట్టిటఁదెచ్చి, చిన్నరా
యని, యలతం దలంగ నల • రారఁగ నెట్టిక నాంజనేయ!నాన్. 147

టీ—తారతండ్రి=తార యొక్క పెంపుడు తండ్రియైన సుషేణుఁడు, అలతల్=ఆయాసములు, తలంగన్=తొలగగా, ఇడఁగల్గిన=పెట్టఁజాలిన, గట్టు=కొండ, (సంజీవిని పర్వతము) నాన్=అనగా.

శా॥ అంతం, గేసరికం దిదే చేనెద న్యయ్యా! దానికెసల్చితం
చేంతేఁ, దిట్టతనాన నేగె; నీఁట, నీ•యిక్కట్ల నగ్గెలికం
జెంతం, గానఁగలేక యేగెనఁగా • జేజేలకం ట్లెన్నగా,
నంతం, జాయనెలంతరా, కడలియం • దంతంత జారెందగన్. 148

టీ—కేసరికందు=కేసరియను వానరునికొడుకు హనుమంతుఁడు ఇక్కట్లు=కష్టములు, జేజేలకంట్లు=సురవైరులు (రాక్షసులు) చాయనెలంతరా=ఛాయాకాంతాభర్త (సూర్యుఁడు).

ఉత్సాహ॥ అక్కడింది చాల్తల ల్గ•యాలి, యాన నాయెడం
దక్కరీని చేతలెల్లఁ • దనయెడం దగం జెడల్
జెక్కఁదాల్చినిల్చినట్టి • సన్నకాని, గాలికం
గక్కరణిని నేగిదారి • నలరఁ గాంచె నెంతయేన్. 149

టీ—కడింది=గొప్పవాఁడు, చాల్తలల్గయాలీ=పదుసతలలు గల ధూర్తుఁడు (రావణుఁడు), సన్నకానిన్=కొంచెపుకానిని (కాలనేమి యనువానిని)

సీ॥ కని, దారిఁ దలఁగితి • నవియెంచి, యల, జెడ
దారిరాయని చేత • దారిఁదెలిసి
చేనిఁగెద, నని యాత • నిని, జేరి, తన తెఱఁ
గతని కెఱింగించి • యతని చేత
దగ నడంచెడి నీటఁ • దగినట్టి నీటిన,
బ్రైతేఁగి నీరానఁగా • నేగిదానఁ
దన్నెదిర్చిన తాఁటిఁ • దాల్చిన రాజెక్కి
జెక్కాడి దానిచే • జెడలదారి
తే॥ తెఱఁగెఱింగి దాయందాకఁ • దెలిసి యాతఁ
డట్టె తెక్కలదారిగా • నంజన కఁట
గలిగినట్టి డడరి దానిఁ • గండడంచే
నయ్యెడల నదినెరసరి • యైయెదిర్చె. 150

టీ—దగ=దప్పిక, నీటఁదగినట్టి=నీటిచే నొప్పినట్టి, నీటినట్టు=జలాశయము (కొలను), తాఁటిఁదాల్చిన, రా=పాశధరుఁడైన ప్రభువు (వరుణుఁడు) జెక్కి=వానిగుఱ్ఱము (మొసలి) దాయక్=పగతుని, తెక్కలదారి=పక్షి, నెఱసరి=సింహము.

పంచచామరము.

ఎదిర్చినంత రాచ లెంక • యేఁచియార్చి దానిఁగై
నదల్చి తాఁచి నేలరాయ • నార్కియై చెలంగి, యం
చేఁదల్చినట్టి చేతయాగెఁ, • జెక్క నల్తతీరఁగాఁ
గదల్చెలంగెఁ జిన్నరాచే • కం; దికేల? గట్టిదే. 151

టీ—రాచలెంక=హనుమంతుఁడు, కైనదల్చి=చేతితో నదలించి తాఁచి=తన్ని, నేలక్=భూమినిబడవైచి, రాయక్=రాచి నలుపఁగా, ఆర్కియై=(అర్కతనుడు) సుగ్రీవుని వేషమూని, అంచ...యాగెక్=పంపఁదలంచిన కార్యమూగిపోయినది, చిన్న రాచేకందు = లక్ష్మణకుమారుఁడు, అల్తతీరఁగాక్=ఆయాసము తీరిపోఁగా, కదల్చెలంగెక్ = కదలి ప్రకాశించెను.

ఉత్సాహ॥ కడిఁది రాచేదిట్ట నింద • గంగఁ జేరెనన్న; దా
కడిఁదిరాచ లెంక కలఁగి • కల్లకన్నీని గా

ర, డిది, యంచెఱింగి యతని • రాల్చె నెట్టకేల, కా
కడిఁదిచెట్ల, గట్లహత్తి • కణితి నణఁచి నట్లనిక్. 152

టీ—కడిఁది రాచేదిట్ట=గొప్పవాఁడైన రాజధీరుడు (రాముడు), గారడి+ఇద్ది+అంచుక్+ఎఱింగి ఇదిమాయయని తెలిసి, హత్తి=హస్తి, కణిలి=కణితిమెకము.

ఉ॥ రాలిచి, చేగకానిదెసఁ • గ్రిచ్చిరఁజేరి, కడింది యల్లతెల్
గాలిచి, తేర్చుఁగాఁ దగిన • గట్టలరంగని, యల్లలార్చుఁగా
జాలిన తీఁగలం దరసి • చేక్కుఁగఁ గాంచేఁగలేక గట్లరాఁ
దేలికజేతఁ దాల్చియట • దిట్టలెదిర్చిన రాల్చి కైసిరిక్. 153

టీ—చేగకానిదెసక్=త్యాగశీలుఁడైన కుబేరునిదిక్కును, అల్లతెల్ గాలిచి=బాధలను తెల్లును కాల్చి, తేర్చు......గట్టు=హాయి నీయఁగల కొండను (ద్రోణాద్రిని), అల్ల......తీఁగలక్=సంజీవికరణి సమూహములను, కైసిరి=బాహుసంపద.

ఉ॥ రానెలఁ జేరఁగాఁ దలఁచిరా, నడిదారిని దాకి నట్టిరిక్
గైసెఱి లచ్చిగద్దియల • కాడల నేనిక గిల్లి నట్లనిక్
దా, నడఁగించి, రాచెనెల • దగ్గరఁ జేరఁగ నల్లలార్చుఁగల్
జా, నయినట్టి తీఁగజిగి • జానకితేఁ డఁటఁగాంచి నెట్టనక్.

టీ—తాకినట్టిరిక్=ఎదిరించినవారిని, ఏనిక=ఏనుఁగు, లచ్చి...డల=లక్ష్మీనివాసపీఠములగు తామరపూలక్రింది కాడలను, జానకితేఁడు=జానకియొక్క భర్త, తీఁగజిగిక్=సంజీవకరణి కాంతిని.

సుగంధి॥ చాయరాయఁ డం చేడల్చఁ • జైఁ గదించి సింగిణిక్
దాయ నేగి తార తండ్రి • దాశరథికి దానిలాఁ
గియ దం చేనంగ, నంత • హెచ్చిలంగ గాలికం
దాయనం దడాల్చఁజేరె • నందతెన్నఁ దన్నఁటక్. 155

టీ—చాయరాయఁడు=ఛాయాభర్త (సూర్యుఁడు) తారతండ్రి=సుషేణుఁడు, ఈయది+అంచుక్+అనంగక్=ఈలాటిదనిపల్కఁగా, గాలికందు=హనుమంతుఁడు.

ఉత్సాహ॥ చేర నంత నల్లలారి చెడి కడింది తీఁగచేఁ ....
దారతండ్రి చిన్నతేని • దనరఁ దేర్చు; నంత గ......

.. ట్టారఁదెచ్చినట్టి యెడన • యల్ల గాలికం దిడెం,
ద్వారలసట లారఁదీర్చి • తొగసిల్లి రవి కఁటన్. 156

టీ—అల్ల......తీఁగచేన్=బాధల నివారణఁ జేయు సంజీవకరణి చేత చిన్నతేనిన్=లక్ష్మణుని, తెచ్చినట్టియెడన్=తెచ్చినచోఁటు.

మత్తకోకిల॥ తారసిల్లిన లంకరాయఁ, డె • దం దలంకి, కలంగి, చె
న్నార నల్కతలిచ్చి నట్టిడి • నయ్యగారినిఁజేరి, తీ
రాగఁదెల్పి కడిందిదాయల • నార్చఁగాఁ దగినట్టి కీ
లార నడ్గిన నాతఁ డిట్లనె • నల్ల రక్కసితేనికిన్. 157

టీ—లంకరాయఁడు=రావణుఁడు, నల్కత...గారిని = నాలుగు వేదములిచ్చిన గురువగు శుక్రుని, కీలు = ఉపాయము, ఆతఁడు = ఆ శుక్రుఁడు.

ఉ॥ రక్కసిరాయ! గట్టియెద • క్రొలఁగఁ దాలికచేతనిల్పి నే
నక్కరచేత నీకనిన • యట్లల యేడికజక్కిరాయనిం
జక్కఁగఁ దెల్పి, తీరయిన • జన్నియ సాగఁగఁ జేసితేని ని,
న్నక్కలనన్ నెలందలఁగ • లాతఁడయేని యెదిర్చిరాఁ డికన్. 158

టీ—తాలికచేతన్ = వనసు నిలుకడచేత,ఏడికజక్కిరాయనిన్ మేషవాహనుని (అగ్నిని)జన్నియ=యజ్ఞము,నెల...యేని=శంకరుఁడేని.

—* రావణుని పాతాళహోమము. *—

తోటకము॥ అనియత్తెఱఁగాతని • కాడి కడం
క, నిటంచినఁ జోల్తల • కాయలతేఁ
డనలేని నెఱంగని • యేగి, తగం
దనరారఁగ నా, సత • నాల్కలరా. 159

టీ—చోల్తలకాయలతేఁడు=పంక్తిశిరుఁడు, సతనాల్కలరా=సప్తజిహ్వుఁడు (అగ్ని).

తరల॥ కలిగి నట్టెడ కట్టె యేగిజే • గానెతౌ యెఱదండలం
గలికి యెఱ్ఱనిచేలలం దగఁ • గ్రాలఁదాలిచి తిన్నయం
గలికి తిన్నని జడికట్టెల • నగ్గిఁజేర్చి, రగిల్చి, నే
చెలికి జి, డ్డెఱవల్ల, గొ, ల్లెఱ్ఱ • మ్రాఁగ, గక్కళ్ళఁ గడిందిగన్. 160

టీ—నెచిలికి=నెయ్యపుచెలి, జిడ్డు=పాలు, ఎఱవల్ల=ఎఱవిన క్తము నెత్తురు పెందుర్తికలు, ఎఱ్ఱమ్రాఁగ=మాంసఖండము, గక్కళ్ళన్=గొత్తెలను.

సుగంధి॥ తెక్కదార్ల లేళ్లఁ, దేళ్ల, • రెచ్చిలంగ నేసి, యం,
దెక్కఁ దింది నల్లదారి • యయ్యనెన్న; నత్తఱిం
జెక్క, రాచదిట్టఁగాంచి • సారె చిన్నరక్కసీఁ
డక్కటా! కడిందిజెన్నె • నన్న చేసె నద్దియేఁ. 161

టీ—నల్లదారియయ్య=కృష్ణవర్త్ముఁడు (అగ్ని) చిన్నరక్కసీఁడు=విభీషణుఁడు, రాచదిట్టఁ=రామునిని, జెన్నె=యజ్ఞము.

ఉత్సాహ॥ చెడక నెగ్గనేని యతని • జింకదారియే ననిం
గడఁకఁ దాఁక లేఁడటన్నఁ • గ్రిన్న నతని జెన్నియం
జెడ, నడంచె లెంక తెగలఁ • జీరిరాయఁ డంచెదా
రడర, లంకకేగి కలఁచి • రన్నియెడల; నాదటన్. 162

టీ—చెడక=(రావణుఁడు సేయు పాతాళహోమము) చెడకుండ జింకదారి=మృగధారి (శివుఁడు) రాయఁడు=రాముఁడు.

తే॥ నేలడాగినరాకాసి • నెట్టనఁ గని
జెన్నఁ నేలగలంచి యా • చెన్నఁటీని
దాకి యింతంత యనరాని • దారిఁ బలఁచె;
నాతఁ డింత్రైనఁ గదలక • యడరె నంత. 163

టీ—నేలఁ=పాతాళమందు, ఆతఁడు=ఆరావణుఁడు.

సీ॥ క్రిన్ననరాకాసి • కంసాలికన్నియ
కడకేగి, తారకం • దడలనాకె
చెన్నెర సికచేతఁ • జేర్చి యీడిచి తెచ్చి
రక్కసిరాదండ • రహిని జేర్చి
గారించె, నాకె చేఁ • న్గట్ల, కన్ని, ళ్లెళ్ల
కరణిఁ జోట్టంగ • గంటఁ జేలఁ
జేర్చియేడిచి యిందఁ • జిత్త, ట్లడంగఁగా
నా కంగదల గీతఁ • నాఁటె నంచె



తే॥ డంద గాడంగఁ దనజేని • జెందనాడ
సరఁగఁ జోల్తలల గయాళి • జెన్నె చెడఁగ
లేచిక త్తినినేయఁగా • లెంకలెల్ల
చిక్కకేగిరి యిల్ సేరె • రక్కసినెల. 164

టీ—రా౯ా...కన్నియ=రాక్షసశిల్పియైన మయునికూతురు (మండోదరి) తారకందు=తార యొక్క కుమారుఁడు (అంగదుఁడు) రక్కసి రావండ౯=రాక్షసరాజైన రావణునిదగ్గర, అకె=అమండోదరి యొక్క, చేన్గట్లన్=స్తనపర్వతములనుండి, కన్నీళ్లు=దుఃఖజలము, ఏళ్లకరణి౯=నదీప్రవాహము లోయన, అంగదలగీత=కష్టపువ్రాత, జన్నె=యజ్ఞము.

క॥ జన్నియఁగలంచి దాయం। దిన్నంగాఁ జెప్పిలంక • నేలం; దనదం
డ్లన్నఁగ రాగా రానెల। కన్నా, కగ్గించెఁజాలఁ • గా, లెంకతెగ౯.

టీ—జన్నియ౯=యజ్ఞమును, దాయం=రావణుని, రానెలకన్నాకు =రాజచంద్రులయందు శ్రేష్ఠుఁడగు రాముఁడు, లెంకతెగ౯=భటసమూహమును, అగ్గించె౯=పొగడెను.

—• మండోదరి భర్తను బోధించుట •—

ఉ॥ రక్కసిరాయఁ డక్కరణి • రాణిజేతం దనచెంకిఁజేరి, నే
నిక్కసి తీర నెక్కరణి• నేలిక నేడ్తెఱఁ గెల్చెదం, చేదం
డక్కసియాడ, దండ నెల•నాగ నెఱెం గని కల్కి! హత్తిరా
రక్కసి దాయ చెండఁగనె•రక్కసిరాయని, నింక నేటికి౯॥ 166

టీ—ఏలిక౯=రాజైనరాముని, ఏడ్తెఱ౯=యుద్ధమందు, ఎక్కరణి౯=ఏవిధముగా, గెల్చెద౯+అంచు౯+ఎద౯=జయింతునా? యని మనస్సున, డక్కు=భయము, అసియాడ౯=తూగాడగా, హత్తిరా రక్క సి=గజేంద్రునకని యొక్క, దాయ=విరోధియైన యీశ్వరుఁడు, రక్కసిరాయని౯=రాక్షసరాజగు రావణుని. (నన్ను)

క॥ ఈనాడ, రాచేదిట్టల। నే, నాలాన నడఁగించి • నెఱి లగ్గిడెద౯
నే, న ట్లడఁచేక సీల్గిన। జానకి నడఁగించి యగ్గి • సరగఁ దిగఁగదే.

టీ—ఈనాఁడ=ఈదినముననే, రాచేదిట్టల౯=రాజశ్రేష్ఠులైన రామలక్ష్మణులను, అగ్గి౯=అగ్నియందు, సరఁగ౯=తొందరగా, దిగఁగదే=దిగుమా (సహగమనము చేయుము).

తే॥ అనిన నాతని కిట్లనె • నన్నెలంత
కడల రాయలఁ గెల్చిన • కరణి రాచె
నెల, నడంచెద ననకాతఁ • డిలఁ జెనంట్ల
నలఁచేఁ గల్గిన "హరి"యని • తలఁచేకంద. 168

టీ—కమలాయలన్ = దిక్పతులను, రామనెలన్ = రాముని, హరి=నారాయణుఁడు.

క॥ అడియాసలేల? నీకా! "కడిది తెలుంగంటి" రాచ • కన్యాకై, ని
న్నడఁగింపఁగ గలిగె నటం! చెడక న్నచ్చి యిలకన్నె • నీ, నేలతఁడే.

టీ—కడిది తెలుంగంటి=దొడ్డవేల్పు (నారాయణుఁడు) రాచ కన్యాకై=రాజశ్రేష్ఠుడై, నచ్చి=నమ్మి, ఇలకన్నెన్=సీతను, ఈన్=ఇయ్యగా, అతడే=రాముఁడే, ఏలున్=రక్షించును.

సీ॥ కడలి నడఁగిన న•ల్కతల తెక్కలికాని
నిల, రాలిచిన యతం•డితఁడు కాద?
కడలిని దఱచెడి • యెక్క డిందినట్టి గ
ట్టెత్తఁజాలిన యతం•డితఁడు కాద?
కడఁకనేచి కడాని • కంటి గక్కసితేని
హో, చ్చపించిన యతం•డితఁడు కాద?
కన్నకం దనకేర్పఁ • గన్న చెన్నంటిని
నేర్పుయార్చిన యతం•డితఁడు కాద?
తే॥ కడిసి తిగహజ్జె లిల నీయఁ • గన్న యతని
నిలనె డావిన చిన్నాతఁ • డితఁడు కాద?
కలఁచి తిగనతలెగ లిలఁ • గలిగినట్టి
యేలికల, గం డడఁచి నతం•డితఁడు కాద? 170

టీ—నా...కానిన్=నాల్గువేదములు దొంగిలిన సోమకాసురు, ఎపన్=సమయమున, డిందిన=మునిగిన, గట్టు = మందరపర్వతమును, కడానికంటిన్=హిరణ్యాక్షుని, కన్న...టినిన్=కొడుకును బాధించిన హిరణ్యకశిపుని, తిగ...యతనిన్=మూఁడడుగులు భూమినిచ్చినబలిని చిన్నాతఁడు=వామనుఁడు, తిగ...నతండు = ఇరువదియొక్కమారులు రాజులజంపిన వాఁడైన పరశురాముఁడు.



ఆ॥ తిగజేగాల తాయిఁ • దెచ్చిన, నిన్నార్చ
నాజికడిఁది చెలికి • నలయతండ
ఎప్పనన్నయయి చెలఁగఁగల్గి, నిం, డాసె
దెప్పఁకేద యొఱప్పి•తిండ్లతేఁడ! 171

టీ—తిగఁబోఁగాంచె తాఁ=ముల్లోకముల తల్లియైన ప్రకృతి, (సీత) ఆఁకడిది చెలికిన్=దశరథుని పెద్దభార్య కౌసల్యకు, ఒచ్చినన్న=లక్ష్మణాగ్రజుఁడు (రాముఁడు) వెస=దిక్కు, ఎఱచి...తేఁడ! =మాంసాశనుల రాజగు రావణుఁడ!

ఉ॥ కాలికిఁ జేయిసాచి రహిఁ • గాంచెనెఱం, గిఁక నేలతేని యి
ల్లాలికి, నల్లనానెడి గ•యాళితెగ, వ్రడి నీటిదారి చాల్
గాలికి, నెల్లనేలతెఱఁ • గంట్లైవల న్సిరియిండ్ల తేఁటికిం
జాలి, కిలా, రలంగఁ, దగ • సాకెడికల్కి జగాలతల్లికిన్. 172

టీ—నేల...లికి=భూనాయకుఁడైన రాముని భార్యసీతకు, నల్ల...గాలికిన్=నక్తము ద్రిగుధూర్తులగు రాక్షససమూహమను వర్షాకాల మేఘములకు మహావాయువైనదానికి, ఎల్ల...తేఁటికిన్=సమస్తభూసురహృదయపద్మ భ్రమరికి, కాలి...గిఁక=చేయిముడిచి మొ్రిక్కు.

ఆ॥ కన్నతండ్రి చిన్న • కన్నెరై యెన్నాళ్ల
కడఁగకట్టై నిల్చె • దన్నకతన
నగ్గిఁజేరఁ జాల • నక్కటా? నాతేఁడ!
యన్నఁ జొత్తలల గ•యాళియనియె. 173

టీ—కన్నతండ్రి=కన్నవాఁడైన దశరథుఁడు, అగ్గిఁజేరఁజాలన్=సహగమనము జేయఁజాలను, చొత్తలల గయాళి=దశశీర్షుఁడు.

శా॥ జేజేలందఱఁగెల్చి కైసిరిని, జే•జేలంది జేజేల చే,
జేజేరాయనికం, టడంగ, సరిజే•జేకం, ట్లిలం ద్రెళ్ళ, నేల్
జేజేరాయల జేరినట్టిడిని, రా • జేజేల రాఁ జేరఁగా
జేజేలంద ఱసీ యిసీ! యనర? యా • సిగ్గేర్పఁదే, నెచ్చెలీ! 174

టీ—జేజేలు=దేవతలు, జేజేలు=నవస్కారములు, అంది=పొంది, జేజేరాయనికంటు=ఇంద్రజిత్తు, జేజేకంట్లు=రాక్షసులు, నేల్జేజేరాయలు=భూసురశ్రేష్ఠులు, రాజేజేలరాన్=రాజేంద్రుని.

ఆ॥ అల్లరాచ చేక • నయ్యొ, జేజేజియ్య
యనియె యెఱింగి, చెడని • యట్టికడిఁది
లగ్గసంగ నంద • లలి, నతని, నెదిర్చి
నాఁడ, జెంక కింక • చేడెదంట. 175

టీ—రాచచెక్కనయ్య = రాజమన్మథుఁడగు రాముఁడు, జేజే జియ్యా=వేలుపులవేల్పు, చెడని...నఁదన్=నశించనిపరవస్తువుఁజెందుటకు, చేడెదంట! = స్త్రీరత్నమ!

క॥ రాచనెల, రాల్చి, రక్కసి। రాచసిరిం జెంద నన్నెరసె దదికాదేన్
రాచనెల నన్నె రాల్చిన। రాచెలి! నెలలేని రేయిరహిని ల్చెదిటన్.

టీ—రాచనెలన్=రాజచంద్రుని,(రాముని) రక్కసి...జెందన్= రాక్షసరాజ్యసంపదను చెందినచో, నన్నున్=రావణుఁడనైననన్ను, ఎరసెదు=కలిసికొనెదవు, నెలలేని=చంద్రుఁడులేని, రేయిరహిన్=రాత్రివలె, ఇఁటన్=ఈలంకయందు (నిల్చెదు.)

క॥ అననెయ్యది యనఁజాలక। తననిక్కట్లఁ దినఁగఁ దాతయ, కలిగిం
చెనని, యెదనెంచి, చేనఁజేయ్యాన నచ్చెలియతని కెఱఁగి ముటగదలితగన్

టీ—తనన్=మండోదరియైనతనను, ఇక్కట్లన్=కష్టములను, తినగన్=కుడుచుటకు, తాతయ=బ్రహ్మయే, కలిగించెన్=పుట్టించెను.

— రామరావణయుద్ధము —

సీ॥ అంతట, నింద్రజిత్తయ్య చేయ్యన నని
కేఁగ నగారాల నెల్లన ద్ద
డరఁగఁ, దట్టించి, కడానిచేలల, రత
నాలఁ గ్రొల్లుగలఁ గండాలఁదాల్చి
సింగిణీల, సరాలఁ జేరిచిన కడాని
తరకసా, లంగీలఁ దనరఁ జేర్చి
తిగటెక్కియాలచేఁ దేజీలగంటలఁ,
గ్రైసేసిన కడాని కలికితేరి
తే॥ దంటసాహిణి తాఁదెచ్చి దండనిడిన
నెక్కి, తత్తడి తెగలచే నేనికతెగ
చేతఁ, గాల్బల్గ తెగచేతఁ జెలఁగి, క్రిక్క
లేయుచుల, లంకరాయ! జేజే! యనంగ. 178

టీ—కడాని చేలలన్=బంగారుబట్టలను, శరశబ్దభవము, సరము, దాసిబహువచనము సరములు, దానిరూపము, సరాలు = బాణములు, రత్నశబ్దభవము, రతనము, తిగ=మూఁడు, సాహిణి=రథముతోలువాఁడు, క్రిక్కలు=వందిజనము, జే, జే=జయము, జయము.

తే॥ గాలిదిండి నెఱకల రాకాసిదిట్ట
గాలినెచ్చెలి చాయ రాకాసిదంట
కత్తి,తేళ్ల నెఱకల రాకాసిజట్ట
లండగా దండ, రా నేగె నాతఁ డనికి. 179

టీ__ గాలి...దిట్ట=సర్పరోముఁడు, గాలి...దంట=అగ్నివర్ణుఁడు కత్తి, తేళ్ల......జట్టలు= ఖడ్గరోమ, వృశ్చికరోములు, అండగాఁ=సహాయముగా, దండఁ=దగ్గరగా, రాఁ=రాఁగా, అతఁడు=ఆరావణుఁడు అనికిఁ=యుద్ధమునకు, ఏగెఁ=వెళ్లెను.

ఉ॥ ఇట్లని కేఁగినట్టి యొకయొక్కటిరక్కసి దండ్లఁగాంచి, చేఁ
జెట్లఁ, గడిందిగట్లనిడి చెట్లదిరింగెడి దండ్లఁ టాగి గాఁ;
జెట్లనిలంగఁ జాల్కడిఁది జియ్యల రక్కసి దిట్టలెక్కచే
నట్లనిఁదాకి చీలిచిరి యక్కఱకైనసరాల నీటెలఁ. 180

టీ__ఎక్కటిరక్కసిదండ్లఁ=సహాయములులేని రావణసైన్యమును, గట్లను=కొండలను, చెట్ల...జియ్యలఁ=నృతుచరులగు గొప్ప ప్రభువుల.

ఆ॥ హత్తి, తత్తడీల, నఱదాలదాకించి
కాళ్లఁ గేళ్ళఁ,గీళ్ళఁ గత్తిరించి
నట్లచెక్కడంచె నలరాచెదండ్లస్సి
యలిగి రక్కసితెగ నలిచి రంత. 181

టీ__హత్తి=హస్తిశబ్దభవము, ఏనుఁగు, తత్తడీలఁ=గుఱ్ఱములను

శా॥ రాలం గాలరిదండ్ల గండడఁచి తేర్లంగట్లచే నార్చి, తే
జీలం జెట్ల,నడంచి, చౌనయిన జేజేదాయ చేయీఁటెలఁ
గ్రాలం జెక్కడఁగించి, యేసికల, నారాకాసి రేరాయనిఁ
జాలంగా, నలయించి చింపి, యిలరాచేం దెన్న దానెంతయేఁ. 182

టీ__ కాలరిదండ్లఁ=పదాతిసమూహమును, చౌనయిన=చౌవనైన జేజేదాయచేయీఁటెలఁ=రాక్షసులచేతి యీఁటెలను, రాకాసిరేరాయనిఁ=రాక్షసరాజచంద్రుని, ఇలరాచేందు = భూనాయకచంద్రుడు, చించిరి=విదళించిరి.

ఉత్సా॥ ఏచి నేల, రాయఁడిగిచి యెగిరి కాలఁ దాఁచి నేల్
రాచికేలఁ జెఱచి కఱచి రాఁగనలచి యెదిరి కాల్

దాఁచి నేలఁ జిక్కినట్టి • దానినెత్తిచీల్చి రా
రాచనెలల లెంక లెదిరి • రక్కసి నెల లెంకలన్. 183

టీ__ ఏఁచి=విజృంభించి, తాఁచి=తన్ని, లెంక=భటుడు, రాచనెలల లెంకలు=రాజచంద్రులయిన దాశరథులభటులు, ఎదిరి=విరోధిరైన రక్కసినెల=రాక్షసచంద్రుని యొక్క.

—* యుద్ధవర్ణనము *—

సీ॥ తలకాయలానల్లి • దాసరి తెగగాఁగ
నెఱిగెళ్లి గాలిదిం•డి తెగగాఁగ
నఱదాల తెగ లెల్ల • నరిది కలాల్గాఁగ
లలి నరాలాయెట్ట • ల, తెగగాఁగ
గడితీగ కండలేనె • గళ్ళ తెగ ల్గాఁగ
జేత లేసి నల్లయే•ళ్ళ తెగ గాఁగఁ
దత్తడి తెగ లెల్లఁ • దరఁగ తెగల్గాఁగ
నెఱహత్తి తెగల, తి•న్నె తెగ కాఁగ
తే॥ నెనఁగదయ్యాలనడియె, యే•ళ్లనడిగాఁగ
జెక్కనని నేల కడలికి • సాటిగాఁగ
గానఁగానయ్యె, నయ్యెడఁ • గత్తినెఱక
లఁ దగి నాతఁడ గాలికం•దెదనతాఁక. 184

టీ__ నల్లదాసరి=తాజెళ్ల యొక్క, తెగగాఁగన్ = సమూహము కాగా, గాలిదిండి = పాముల యొక్క, కలాల్ =ఓడల యొక్క, ఎట్టల= ఱానపాముల యొక్క, నెగళ్లు=తాఁబేటివలె నీఁటదిరుగు పొడుగైనజంతువుల యొక్క, నల్ల=రక్తప్రవాహము, తత్తడి తెగ = గుఱ్ఱములగుంపు, హత్తి తెగ = ఏనుగులగుంపు, అనినేల=యుద్ధభూమి, కత్తి...నెఱ=ఖడ్గరోముఁడు, గాలికందెదన=హనుమంతు ఱొమ్మునను.

సీ॥ తాఁకిన, నాతని • దనచేతిగట్టసి
యిలఁబొల్చి గాలికం • దేపియార్చె
గాల్దిండ్ల నెఱకలఁ • గలరక్కసీఁడేసె
జెట్టసి తారకం•బట్టగార్చె
గడిఁదెసోళ్ల నెఱకె•ల్లల చెన్నటి, కలంచి
నగ్గికం దాతసి • నడచియార్చె

..రహిఁగాలి చెలిచేయ • రాకాసితాఁకిన
నేలరాయం డాతఁడె, గడతేర్చె,
ఆ॥ నంత లంకరాయఁ • డానేల రాఁదాఁకె
నవేట గట్టినట్టి • రహాహాయనగ
నల్ల, నెఱనరి యయి • నట్టి జేజేదాఁకి
నట్టిరక్కసి తెగ • జెట్టి సరిగ. 185

టీ—గట్టు+ఏసి=కొండను వేసి, గట్టిండ్ల...సీఁడు=సర్పరోముఁడు, గాలికందు=హనుమంతుఁడు, తారకందు=అంగదుఁడు, అగ్గికందు=నీలుఁడు, తేళ్ల...చెన్నుఁటి=వృశ్చికరోముఁడను కుచ్చితుఁడు, నెఱ...జేజే=శూరుఁడగు వేల్పు (రాముఁడు).

క॥ తాఁకితనదిట్టకై సిరి। రా, కన్నా కెన్నగా, సంరఁగ ననె, తేఁడా!
రాకాసి సన్నకాండ్రిం। డీకడఁగ నడంచి తనకంసిల్సరిగ ననిఁ. 186

టీ—రా, కన్నాకు=రాజశ్రేష్ఠుఁడగు రాముఁడు, అనిఁ = యుద్ధమున, సరిగఁ, సిల్=నిలువఁబడుము.

సీ॥ అదరఁజేర్చుఁగఁ జెట్లు • నడయాడఁగల జెట్లు?
తత్తడి యేనిక • ట్లాట్లెకాని,
యాలించే, జెడదార్ల • యల నక్కతలసద్ద?
నాకేళ్ళ సింగిణీ • ల్నాదకాని,
మొక్క, యిట్టట్టాడ • నీవ రక్కలసంత?
తిన్ననైన కడాని • తేర్లు, కాని,
తాళ్లఁ జెట్లంగట్టి • రహిదాట, నీరిట్ట?
కడిఁది రక్కసిదండ్ల • కడలికాని,
తే॥ కన్న యతఁడేఁగఁ, దనకంటెఁ • జిన్నయాఁతఁ
డడరి రాలచ్చిఁగని కాన • కంచె, రాణి
కానఁ డిగనాడి చేన, గాయ • గస్సలదిని
డీఁకెడఁగనిల్క, నన్నేల • తాఁకెదయ్య? 187

టీ—జెట్లు+అ=జెట్లు=మొనగాఁడ్రి! (శోతులా!) సద్దు+అ=చెప్పుడా? ఈఁద, రిక్కలసంతు+ఆ=వాయుపుత్రుమొక్క, నాఁడయొక్క సంతానమా (ఆంజనేయాఁగదులా?) నీరిట్టు=జలరాశియా?, కన్నయతఁడు=

దశరథుఁడు, చిన్నయాంతఁడు=చిన్నవాఁడగు భరతుఁడు, రాలచ్చి=
రాజ్యసంపద, రాణి=సీత.

### —• నిందాస్తుతి •—

చ॥ కడలి జొరంగినం, గడిఁది • గట్టెసఁజేరిన, నేలడాఁగినం,
జెడఁగ తాల్పుకన్నుఁ, గయి • సాచిన, నేత్రైఁగంటిఁవైనఁ, గా
నల, నదయాడినఁ, గడఁకి • నాగిరిఁ దాల్పినఁ, జెట్లనిల్చినం
గడ కికఁ గల్కియైన, నెద • గట్టి, నిగాఁగని గం డడంచెదన్. 188

టీ—కడ...నన్=మత్స్యమైన, కడిఁ...రిన = మందరముక్రింద కూర్మమైన, నే...నన్=వరాహమైన, జెడ...గన్నన్ = నరసింహమైన, కయిసాచినన్=వామనుఁడైన, నే...న=పరశురాముఁడైన, కా...నన్= రాముఁడైన, నా...న=బలరాముఁడైన, చెట్ల...నన్=బుద్ధుఁడైన, కల్కి= కల్కిమూర్తియైన.

ఉ॥ రక్కసిరాయఁ, డిక్కరణి • రాయని నాఁడిన, నాలకించి, యా
యొక్కటిరాయఁ డంత నగి • యోటికిఁ జాలఁగఁ, గాల్లిఁటాడఁగా
రక్కసిరాయ! యల్ల యిల • రాయలదాయ కడిందిదాయ, ని
న్నొక్కటిరాయ లెన్నఁ జెఱ • సిద్ధది, వైరింద్రికత న్నెఱింగితిన్ 189

టీ—ఇల రాయలదాయ=ధరణీశులవైరి (పరశురాముని) యొక్క కడిందిదాయ=పెద్దపగవాఁడు (కార్తవీర్యుఁడు)

క॥ సీయడిగినట్టి క్రిచ్చిడి।యాయెడ, నక్కటికఁ గాచి • నట్టిదయిన యాం
రేయెండ రాచెదారియ।కాయంగారాని నిన్ద • గంగ నడఁచెదన్ 190

టీ—క్రిచ్చు=కోరిక, అట్టిఁడు=అటువంటివాఁడు, రేయెండరాచె దారియ=వెన్నెలతేఁడైన చంద్రధారి (శివుఁడు) యే.

క॥ అనికిఁజక్కైన సరాలం। దవపంగా నెదిరి యెడద • నాఁటిన, నాతం
డెవలేని నారసాలం। గణకం దాశరథియెద ని • గాఁ గనియేసెన్.191

టీ—ఎదిరి=విరోధి రావణుఁడు, దాశరథి=రాముఁడు.

### మత్తకోకిల.

ఏసి రక్కసిరాయఁ డంతట • నెన్నియేని కడాని నీ
దీఁసినట్టి సరాల దాశర • థిం, గలంచిన, నేలఁతేఁ
డేసె, నట్టిసరాల రక్కసి • యేలికం దల లన్నిటం
డాసి, గాడఁగ నెఱ్ఱలన్నిఁట • నల్లయేర్లయి కారఁగాన్. 192

టీ—కడాని=బంగారు, రక్కసియేలిక=రావణుఁడు.

సుగంధి॥ రావెదిట్టదాయ, కానరానికాల్సరాల, నా
రాచెదిట్టగాలిదిండి • రావెదాయ నారసాల్
గాచి,దాయఁ దీసియేచి • గం,పడంచి చేక్కఁగ్గా
దాచినట్లు తర్కసానఁ • దాచిరెల్ల రెన్నఁగాన్. 193

టీ—రావెదిట్టదాయ=రావణుఁడు, కానరానికాల్సరాలన్=సర్పబాణములను, రాచెదిట్ట=రాముఁడు, గాలి...నారసాల్=గరుడసంబంధబాణములను, కాచి=పొంచి, తర్కసానన్=తరకసమునన్, అంబులపొదియందు.

—• మాతలి రాకడ •—

మత్తకోకిల॥ అత్తఱిం దెలుఁగంటిరాయని•యానఁ గల్కికడానితే
రెత్తఱిం జెడనట్టిసింగిణి • నేఁచిదాయలఁ జెండజాల్
సత్తిఁగన్నసరాల సాహిణి • సక్కఁదెచ్చి యిపంగ, రా
సత్తితేఁడల తేరినెక్కెదె • సల్ చెలంగ జేగాజిగిన్. 194

టీ—తెలుఁ...యానన్=దేవేంద్రునాజ్ఞచేత, సాహిణి = రథముతోలువాఁడైనమాతలి, రాసత్తితేఁడు = రాజసామర్థ్యముగలరాముఁడు.

శా॥ జేజేరాదెస గట్లతేని నెఱజే•జేయెక్కి నట్లెక్కి తేర్
జేజేరాయని, యంగిసింగిణిసరాల్ • జెన్నారఁగాఁ దాల్చి రా
జేజేరా, సరితేఁడితండనఁగ జే•జేలెన్న, రాకాసి రా
జేజేరాయనిఁ దాకె, నేనికలరాన్ • సింగాల గండట్లనిన్. 195

టీ—జేజే...తేనిన్=ఇంద్రదిశయందలి పొద్దుపొడుపు కొండలతేనిని, రాకాసి...రాయనిన్=రాక్షసరాజేంద్రుని, ఏనికలరాన్ = గజేంద్రుని, సింగాలగండు=సింహములమొనగాఁడు, అనిన్=యుద్ధమున.

ఆ॥ నెఱేని హత్తిహత్తి • నెఱసరినెఱసరి,
గిత్తగిత్త, సత్తి•సత్తి, గట్ల
దిట్టగట్లదిట్ట • దిట్టతనానన
కడఁగినట్లు యిద్ద•ఱడరి రనికి. 196

టీ—హత్తి=ఏనుఁగు, నెఱసరి= సింహము, గిత్త = ఎద్దు, సత్తి= శక్తి, గట్లదిట్ట=గట్లతేఁడు (శైలపతి) దిట్టతనానన=ధైర్యముచేతనే.

ఉ॥ ఇద్దరి తేరిగాండ్లసడి • యిద్దరి సింగిణియల్లెతాళ్లనా
దిద్దరి దండ్లనండిసడి • యిద్దరి నిద్ద రవళ్ళి నట్టి స,
ద్దిద్దరి కత్తలాన్లసడి • యింతయు, యంతయు యేఁచి యెల్లెడల్
వద్దరిలంగఁ జేయ, నని • దండిగఁ జేసిరి కచ్చ్పలెచ్చఁగాన్. 197

టీ— తేరిగాండ్లసడి=రథచక్రముల చప్పుడు, సద్దు, సడి=చప్పుడు, కత్తలాన్ల=గుఱ్ఱములయొక్క, కచ్చ=కక్ష.

శా॥ ఆకై సీకయి తేరికండ్లనఁగఁ జెన్నారంగ సింగాణిదం,
డాకై దండలఁ దీసి, లాఁగి, యిడిన ట్టైనం గనన్ రాక, చె
న్నైక్కై దంటతనానినిం దెలియఁ జేయంగల్గి, రాయిద్ద ఔ
హా! కై లచ్చి ననిం గడానిజిగి నీటైనట్టి నారాచలచేన్. 198

టీ— కై = చేయి, తేరికండ్లనఁగన్=రథచక్రములోయన్నట్టు, సింగాణిదండు=వింట్లగుంపు, కైలచ్చి=బాహుసంపద, కడాని=బంగారు.

ఉ॥ చేసిరి క్రాలఁ,దా, రెదలఁ; • జించెఁగ నేసెడి నారసా లెదల్
గాసినిఁ జెందఁగాఁ గలఁచి, • కందనగాయ, లగల్చి, న ద్దెసల్
గాసిలఁజేసి నింగియిల • కానఁగరాక చేనంగఁ జాలఁగాఁ
జేసి చెలంగిరన్న, నిఁకఁ • జేసెడిదేది? తలంచి కాంచినన్. 199

టీ— కందనగాయ=గుండెకాయ, అగిల్చి=పగులఁగొట్టి.

ఉ॥ సింగిణి గట్లదాయ, నెఱసింగిణిగాఁగ, సరాలచాయ, లె
న్నంగన తీఁగడాలయి తనర్చఁగ, నల్లియతాళ్లటినా దెసం
గం,గడి నీటిదారి సడిగా, నిలయేలిక నీటిదారి, నిం
చెం, గలఁగన్ సరాలజడిఁ • జెన్నటి రక్కసి గట్లయేలికన్. 200

టీ— సింగిణి=విల్లు, గట్ల...గాఁగన్=ఇంద్రధనువుకాగా, సరాల చాయలు=బాణకాంతులు, తీఁగ...ర్చగన్=తీగమెఱపులుకాగా, అల్లి ...సడిగా=గుణధ్వని మేఘధ్వని కాగా, ఇల...దారి=రాజమేఘుఁడు, చెన్న...యేలికన్=చెడుగరి రాక్షసరాజ పర్వతపతిమీఁద, కలఁగన్= కలతపొందునట్లు, సరాలజడిన్=బాణవర్షమును, నించెన్=నించెను.

—• శ్రీరామ హస్తద్వయ సంభాషణ •—

సుగంధి॥ ఈయనైనఁ దిండికైన • నేగె దేవ నేనటం
చే, యనిం గలంగి జారె • దేల? యన్న డాకయిం

దాయఁజేరి కేరియంత ♦ దాని జంట్రకైయనెం,
"దాయనార్చనా? తడాల్న;♦ తాళియింకఁజెక్కఁగాఁ‌ఙ"॥ 201

టీ—ఈయఙ్+ఐనఙ్=మంచి పదార్థముల దానముజేయుటకుఁ గాని, తిండికైనఙ్=మంచివస్తువులఁ దినుటకుఁగాని, డాకయిఙ్= ఎడమచేతిని

పంచచామరము.

"కలంచి చించి డస్సినంత, ♦ గం, డడంగఁ గాఁ దలల్
నలంచిచెండనా!" యటంచె♦నంగ నేలఱేనికిఙ్;
దలంగినట్టిదానఁ, గాని ♦ దాయఁ గాంచి యళ్కినే
తెఁలంగ నం చేది ర్నదల్చె ♦ దానిరాయఁ డెన్నఁగఙ్॥ 202

టీ—తలంగి=తొలంగి, దానిరాయఁడు= రాముఁడు, అనగా, నిందిరియాధినాథుఁడు.

ఉ॥ రక్కసిరాయఁ డక్కరణి, ♦ రాచెసరాలజేడిం గలంచనై,
యక్కసి, నారసాలనిడి ♦ య గ్గడిచీఁకటి నించె రాయనిం,
జెక్కని నేలతేఁడనెడి ♦ చాయనెలంతలదంటతేఁ డటం
జిక్కని నారసాలజిగి ♦ చేతఁ గలంచి చెలంగె నెంతయేఙ్. 203

టీ—రాచె... జేడిఙ్=రాజేగు రాముని బాణవర్షముచేత, నార......నించెఙ్=బాణములనింపి చీఁకటిఁగలుగజేయఁగా, చెక్కని ......తేఁడు=అందగాడైన రాజమార్తాండుడు, నారసాలజిగిచేతఙ్= బాణప్రకాశముచేత.

సీ॥ చాల్తలలగయాళి ♦ చెలియిక్కచిల్కయ
గాలిదిండిసరాన ♦ నేలి కార్చె,
గాల్దిండి చిల్కఝఁ♦గా, దాయ; రాయఁ డ
ద్దాని కం, టన్గేసి ♦ దానినార్చె,
దాయ, యన్నిఁటిదిండి♦రాయని చిల్కయ
దానికం టన్గేసి ♦ దంటయార్చె,
జింకదారి సరాన ♦ లంకరాయఁ డలంచె
సిరితేని చిల్కసి ♦ జియ్యయార్చె,
తే॥ నెన్నితెగల సరాలేయ ♦ నన్నితెగల
నారసాలేసి యన్నింటి ♦ నాయఁడార్చె

లంకతేనికి నిలతేని ♦ కంకిలింత
లేక కలనయ్యె సతనాళ్ళ ♦ దాఁకనిల్లె. 204

టీ—చెలియిక్కచిల్కు = వాయవ్యాస్త్రము, గాలిదిండి సరానక్ =సర్పాస్త్రము చేత, గాల్దిండిచిల్కు=సర్పాస్త్రము, దానికంటల్లు=దానివిరోధియైన గారుడాస్త్రము, అన్నిఁటి దిండిరాయని చిల్కు=ఆగ్నేయాస్త్రము, దానికంటల్లు=వారుణాస్త్రము, జింకదారిసరానక్=పాశుపతాస్త్రము చేత, సిరితేనిచిల్కు=నారాయణాస్త్రము.

—* అగస్త్యునిరాకడ. *—

తే॥ కడలి నీ రఱచే, దాఁటి ♦ కదలనీఁక
చేర్చితాగ్రిన నేల జే♦జేలదంట
రాచరేతేని నాయెడ ♦ రహినిఁజేరి
చాల లగ్గందఁగా నాడి ♦ సరగ నంత. 205

టీ—కడలి,..దంట=సముద్రమునీరంతయు నాచమనము చేసిన భూసురుఁ డగు నగస్త్యుఁడు.

క॥ తిన్నని తెలుఁగంటితనా । నన్నుడయాడని కతనఁ, గ♦ణఁక నేరయునం
జెన్నలర నన్న దాఁకం । దిన్నంగాఁ,దెలియ దీరి♦తెలుగీ రలకే. 206

టీ—అన్న దాఁకక్=నీవుశక్తిసమగుడవైన పరబ్రహ్మ వస్తువనిపలికినదనుక, ఈరి=మీ యొక్క, ఈరలకుక్=మీకు.

తే॥ రాచరేతేఁడ! తిగజగా ♦ లగ్రహినిగల్గఁ
జేసి, తగఁగాచి, రాలఁగాఁ ♦ జేసినట్టి
దిట్టలీరయి తెలియని ♦ తెలుఁగదరఁగఁ
గ్రాలఁగాఁజేన్నె? యన్నన్న! ♦ కడఁకదక్కె. 207

టీ—తిగజేగాల్ =ముల్లోకములను, అన్నన్న=ఆశ్చర్యము.

క॥ నీ తెలుఁగిట్టి దటంచేని । నా తెలుగంట్లయ్యగారి ♦ కలజేతనాల్కల్
జాతినెఱసరికిఁ దెల్లని।నాతినెరసి నట్టిడికిని♦నలిఁ దెలిసెడినే. 208

టీ—తెలుగంట్లయ్యగారికిక్=బృహస్పతికి, జేత=సరికి, రెండునాల్కలున్న పాములజాతియందు శూరుఁడగు నాదిశేషునకు, తెల్లనినాతి నెఱసినట్టిడికిక్=సరస్వతినిగలిసినవానికి. (బ్రహ్మ)

ఉత్సాహ॥ కానజాతిజేనిఁజాయ ♦ కల్కిదేని నింతడెం
దాన నానఁగాఁదలంచి ♦ నందలంచినట్టి తీ

రైనయట్టిచేతలైన • నైతనచేఁ కేలనం
చానవాడి యేగెనంత • నల్లజేన్నిగ ట్టటేక్. 209

టీ—జాతితేనిక్=వంశభర్తయైన, చాయకల్కితేనిక్=ఛాయాకాంతాభర్తను, అల్లజేన్నిగట్టు=అబ్రాహ్మణుఁడగు నగస్త్యుఁడు.

ఉ॥ ఏగిన యంతరాచేనెల • యెక్కటిచాయనెలంత తేనికిక్
సాగిలిచాలసాల్లెఱఁగి • చెక్కని తే, జెడరంగఁదాల్చి, త
న్నాగినరక్కసీని నని•నాగియెదిర్చి, సరాల నేయఁగాక్
సాగిననెల్లడల్ కలఁగ•సాగిన దాయనికేల తల్చుఁగాక్. 210

టీ—రాచెనెల=రాజచంద్రుఁడు, దాయక్=రావణుని;

ఉత్సాహ॥ అంటరాని తేనిసాటి • యైన నారసాల, రా
దంట సాహిణీని, జేరిఁ • దత్తడీలఁ గాఁడఁ, జె
న్నంటి లంకరాయఁడేయ • నఱికి యన్ని నేలతేఁ
డంటి యగ్గి నారసాన • నాచెనంటి నేయఁగాక్. 211

టీ—అంటరానితేని=ముట్టుకొనవీలుగాని ప్రభువగు నగ్నితో, రాదంట=రాజులయందు నేర్పరియైన రాముని యొక్క, అగ్గినారసానక్=ఆగ్నేయాస్త్రముచే.

—• రావణమూర్ఛ •—

ఉ॥ రక్కసితేని నద్ది యెదఁ • గ్రిన్నఁ గాఁడఁగఁజేయ నంతటక్
రక్కసిదం ట్లడల్ గనఁగ • రక్కసిరా నడగ ట్టనంగ, న
ట్లక్కడి తేరఁజారె; నఁట • నాతని సాహిణిదంట తేరినిం
డక్కడరం, దలంగ నిడ • డస్సినరక్కసితేరి యిట్లనెక్॥ 212

టీ— అద్ది=ఆయాగ్నేయాస్త్రము, నడగట్టు= నడచుకొండ యోాయనగా,

చ॥ ఎటేఁగి, యెటేంగి నాదయిన • యేడ్తెఱనెల్ల టిసీ! యిసీ! యనం
జెటేఁగిఁచి తేరి సిఁడిడిలి • సాహిణి! యియ్యెడ సి న్నిఁకేదియం,
దటేఁ గినఁ గల్నలగ్గెకద? • యంచేతఁ డయ్యెలకన్నె తేనికిం
దరి గఁ, దడాల్న తే రడరఁ • దాఁ చనిని తార్చిన తేనిఁదాకినక్॥213

టీ—ఏడ్తెఱ=యుద్ధక్రమము, కల్నక్=యుద్ధమునందు, అటేఁగినక్=(మరణించిన) పోయిన, లగ్గెకద=మేలేకద?, తార్చు+అని=దాకొల్పుమని.

సుగంధి॥ ఎన్నఁజాలనట్టి గట్టి • యేద్దెఅయ్యె నయ్యెడం
గన్నినం గడానిచాయ • గ్గినట్టినారసా
లెన్నియేని లచ్చెనన్న • యెక్కినట్టి తేరి,సిం
డ, న్నిలంగ నీకయేసె • డయ్య, రక్కసీఁ డహా!॥ 214

టీ—ఏద్దెఅ=యుద్ధము, కడాని...సాలు=బంగరు కాంతులీను బాణములు, లచ్చెనన్న=రాముఁడు, డయ్యెన్=అలయునట్లు

ఉ॥ ఏసిన నేలతోఁ డడరి • యేద్దెఅ నగ్గిని దీటుఁజాల్ప రా
లేసి, నలంచి యన్ని; యతఁ • డెక్కిన తేరిన సాహిణీ నటె
యేసినఁ డన్నెఁ జాల్మలల • యేలిక; యావట రక్కసీఁ డెదం
గాసి నలంగ నల్లజెడి • కాతెఁ గడిందిగ నక్కలాచెఁగాన్॥ 215

టీ—రక్కసీఁడెదన్=రావణుఁడు మనస్సునందు, గాసిన్=కలత చేత, నల్లజెడి=రక్తవర్షము, నక్కలాచెన్గాన్=జంబుకము లఱువగా.

ఉ॥ చెన్నడఁగంగఁ గీఁడిడెడి • చిన్నెల కెడ్డఁ దలంక కింతయేఁ
జెన్నఁటి రక్కసీఁడడరి • చేయఁగ సాగె నవిం, జెలంగఁగా;
నెన్నఁగ నెక్కటీఁ డయిన • యేలిక కిద్దియ చిన్నె కాక, తా
నన్నక నన్నజారెడినె? • చచ్చిన నండెడికాక లగ్గహా?॥ 216

టీ—కీఁడిడెడి చిన్నెలకున్ = అమంగళములైన గుఱుతులకు, అద్దియ=రావణుననుఁగనుపడు, నశుభచిహ్నమే, ఏలికకున్=రామునకు, చిన్నె కాక=శుభ చిహ్నము కాక, లగ్గు=మేలు.

సీ॥ అదట నేలతోఁ • డడరి రక్కసి తేని
చేరండల నరాలఁ • జేర్చి చేర్చి,
యీాదదిం డ్లేలిక • కెనయైన నారాలఁ
దలకాయలన్నిఁటఁ • దార్చి తార్చి,
తెఱఁగంటి [illegible]కత్తి • తెఱఁ గంటిన నరాల
నల్లకీళ్ళం జేర్చి • యేర్చి యేర్చి,
తెల్లని రాయని • తిగకంటి కెనయైన
[illegible] చే నెఱ న[illegible] • గార్చి కార్చి,

తే॥ యెక్కటీఁడవజెల్లిన • రక్కసీని
చె, న్నడంగఁగ నెంతేని • జించి చించి

కలంచి కఱకైన నార్సాల • గఱకఱతెగ
నేసెఁ దలకాయలంగెల్ల • నెంచియెంచి॥ 217

టీ—ఈదదింద్లలికి=సర్పరాజు, తెఱఁగంటిరాకత్తి=ఇంద్రనివజ్రముయొక్క, తెల్లనిరాయనితిగకంటికిఁ=తెల్లనిప్రభువగుశివునిమూఁడవనేత్రమునకు.

క॥ తెగనేసినతలకాయ । త్తెగ, కైతెగ, లట్లెకల్లఁ • దెలిసియతఁడ నేఁ
దెగఁజేయఁజాలకేగెన?। తగలకయేగెన? సర్పా • తల్కున నకటా!॥ 218

టీ—కైతెగలు=చేతులగుంపులు, అట్లెకల్లఁ=వెనుకటివలె కలుగఁగా.

క॥ అరసికని తిరిగి, యఱనెల । సరాల రాకాసితలల • సందిళ్లఁజేతల్
కఱకఱ, నఱకినఁగనఁగన। నఱకిన యెడఁదిరిగి కలిగె • నలి నక్కరణిఁ 119

టీ—అఱనెల...... సరాలఁ=అర్ధచంద్ర బాణాల చేత, కనగనఁ=చూడఁజూడఁగా.

క॥ ఆకరణినిఁ దెగనేయఁగ । నాకై, తలకాయ లట్లె • యలరారంగా
నీకరణిజేరిగె దరిదం।డ్లాకలిగెడి చిట్టఁగాంచి • యడలందంగాఁ.

టీ—కై తలకాయలు=చేతులు,తలలు, అట్లె=ఆవిధముగ,జేరిగెఁ=కొంతసేపరిగె.

క॥ తెగినతలల్, తెగెడితలల్ । తెగిగ్రద్దల్లన్న నింగి • దేల్ తలకాయల్
తగినట్లు కలిగెడితలల్ । జిగిఁగ్రాలెం గారడీని • చిట్టాటయనాఁ. 221

టీ—నింగిఁదేల్=ఆకాశమునఁదేలియాఁడు , చిట్టాఁటయనాఁ=చిత్రమగునాటయనఁగా.

క॥ తెగియెగిరెడి తలకాయ। త్తెగ, లేలిక నారసాల • తెగ, లాగ్రద్దల్
తెగలెల్లఁ జేదలనెఱయం।దగి చీఁకటిచేతఁ జాయ • నాయని దాచెఁ.

టీ—చేదలఁ=ఆకాశమున, నెఱయఁ=వ్యాపింపఁగా, చీఁకటిచేతఁ=వానియొత్తిడిచేఁగలిగిన చీఁకటిని, చాయనాయనిఁ=ఛాయానాయకుని.

క॥ తెగనేసియేసి, తలకేళ్ళగ, డెడఁదంగాఁంచి, రాయఁ • డంతట నానఁ
జిగిఁదరిగియ త్తఱిని జే। యఁగఁ దగినది కానరాక • యట్టె,నిలంగఁ. 223

టీ—నానఁ=సిగ్గుచేత, జిగిదరిగి = కాంతిహీనమై, చేయగ...రాక=కర్తవ్యమెఱుఁగఁజాలక,అట్టె=ఆశ్చర్యముతో,నిలంగఁ=నిలువఁగా

ఉ॥ రాయని, చెంతఁజేరి చిన • రక్కసితేఁడనె, తేఁడ! చాల్తలల్
రాయనియంద, తాతతన•రం,దగఁ గల్గినచాయ, నాదెసల్
రాయఁ తిండి కన్గై,నది • రాఁ కరక్కసిరాలఁ డన్న,నేల్
రాయల,డంచె,దాని జిగిఁ•గాల్చెడి చిచ్చెర నారసాననే. 224

టీ—రాయనిచెంతన్=రామునిదగ్గర, చిన...డనె=చిన్న వాడగు విభీషణుఁడు, చాల్త...యంద=రావణునందె, తాత...చాయన్ = బ్రహ్మబుట్టిన ఒప్పునట్టి నాభిప్రదేశము, అదెసల్...కన్గైన్=దిక్పతులయాహారము (అమృతము) అదిరాలక=ఆయమృతముపోకుండ, రక్కసి = రావణుఁడు.

అ॥ ఈకరణినడంచి • యేఁచి, తెల్లనిచాన
తేని,నింగి,రేయి • తేనినినిడి
లెక్కయిడిన నెన్ని • లెక్కయ్యె నన్నిసా
ర్లట్టెతలలఁ గేళ్ళ•నడఁచెనంత. 225

టీ—తెల్లని చానతేనిన్ = బ్రహ్మసంఖ్యననఁగా తొమ్మిదిని, నింగిన్=ఆకాశసంఖ్యననఁగాసున్నను, రేయితేనిని=చంద్రసంఖ్యననఁగా నొకటి (109) నూటతొమ్మిదిబాణములను.

కం॥ జేతకైదండలచే, నఱిజేతతలచే రక్కసితరి • సత్తిని నేసెన్
జేతకాని జిన్నరక్కసిఁ।జేతనం దనలాఁగెదిరి కెఁసఁగ ననె ననితాన్॥

టీ—జేత...చే=రెండుచేతులచేత, అఱి...చేన్=ఒకతలకాయచేత, సత్తిన్=శక్తిచే చిన్ని...నని=విభీషణుఁడు తనమరణక్రమము రామునకుఁ దెల్పెనని.

ఉ॥ ఏసిన రాచేదిట్ట తగ • నేచి, కలంచి యలంచెసత్తిఁరా
కాసినలంగిర్వైన జత•కై గఱకైన సరాలనేయఁగా
డాసినఁగాంచి, సాహిణిఁ ద•డాల్నడంచె కిదేల? తేఁడ! నిం
దాసిన దాఁక నిల్చితనఁ, • దాటకఁ జెండినరాయఁ డంతటన్. 227

టీ—రాచేదిట్ట=రాముఁడు, ఏఁచి=విజృంభించి, సాహిణిన్=సూతుని.

ఉత్సాహ॥ తాతచి క్కసంగ నేర్చి, • తాకగా నెదిర్చిగా
చేతఁ గాంచి, యేయనద్ది • చెచ్చెరఁ జేని యొందతేన్
జేత సాకిరితెగ కెనగఁ • జెలఁగి లంకరాయనిం
గాతనేసి సీఁటనాని • కలసె దఱకసాననే. 228

టీ॥ తాతవిల్కు=బ్రహ్మాస్త్రము, ఎదిరి +నిగా చేతన్=విరోధి రావణుని లక్ష్యదృష్టితో, వేతసాఁరి=కర్మసాక్షు (సూర్యుల) యొక్క తెగకున్=సుంపురకు, ఎరగన్=సమానముగా, లంకరాయనిన్=లంకాపతిని (రావణుని) గాత=ఘాతుకత్వము చేసి=చంపి, నీటన్=నీళ్లయందు ఆని=తృప్తిగా మునిఁగి, తఱకసాన నే=అంబులపొదియందే, కలనేన్=అస్త్రములజేరెను.

కం॥ ఆడిరి జేజేకాఁల్లంట్లాడిరి, తేఁడెంచేఁదగిన • యతఁడని, జేసదార్లిడేరిచె నంగదలని నా, డేరిచెలంగ నిడిరి•నన లలజేజేల్. 229

టీ___జేజేకాఁల్లంట్లు=దేవతాస్త్రీలు, ఆడిరి=నాట్యముచేసిరి, జేసదార్లు=ఋషులు, ఆడిరి=పల్కిరి, అంగదలు=కష్టములు, ఈడేరిచెన్=తొలఁగించెను, నాఁడు=రావణసంహార దినమున, జేజేలు=దేవతలు, ఏరి=చెట్లనుండియేరి, ననలు=పూలు.

చ॥ అనిఁదెగినట్టి చేఁత్తలల • యాతని నాతనికంటెఁ జిన్నతం
డనిచిన నాగనట్టి నెర•యంగదఁ దగ్గరఁజేరి, యన్న! నే
యనినటె చేయక్కి,ట్లడఁగ • నయ్యెనె? యియ్యెడ నక్కటక్కటా!
యనితెగయేడ్చె నన్నదరి • నాతనిచేడియ లంద నెంతయేన్. 230

టీ___అనిన్=యుద్ధమందు, తెగి...తనిన్=చచ్చినపంక్తిశిరుఁడైన రావణుని, ఆత...తండు=వానికంటెజిన్నవాఁడైనవిభీషణుఁడు, అనిచినన్=అడంచుకొన్నను, ఆతనిచేడియలందన్ = వానిభార్యలగు మండోదరి మొదలైనవారిచెంత.

క॥ ఏఁడిచిన నంతనెచ్చెలిఁ। జేడియలం గనికరానఁ• జెన్నారంగాన్
తేఁడలరఁదేర్చి, రక్కసి। తేఁడల జేజేలతెంకి • రెచ్చిలజేరన్. 231

టీ___తేఁడు=రాముఁడు, నెచ్చెలిన్= స్నేహితుఁడగువిభీషణుని, చేడియలన్=రావణుకాంతలను, జేజేలతెంకి = స్వర్గము, రెచ్చిలన్=హెచ్చుగ.

మ॥ చెలిచేఁజేయ్యెన నగ్గిచేత లలరం•జేయుంచి, అన్నన్న!; నె
చ్చెలికండంజేని లంక, కాతనిని తేన్ • జెన్నారఁగాఁజేసి, నా,
చెలిజేటం, దనరారలనం చేనిచినం • జేజేలకంట్లండనాఁ
జెలియల్చక్కనియయ్య, లచ్చెన చేనెం•జెన్నైన యాలంకకై. 232

టీ__చెలిచేఁ=(రాముఁడు) స్నేహితుఁడైన విభీషణుచేత, లంకకుఁ=లంకానగరమునకు, నెచ్చెలిదండఁ=స్నేహితుజెంట నేగి,ఆత...జేసి=వానినిప్రభువునుజేసి, రా=రమ్ము, చెలి...యమ్యా=రమణీమన్మధుఁడగు, లచ్చ్వన=లక్ష్మణుఁడు, చనెఁ=వెళ్లెను.

శా॥ ఆలచ్చ్వన్న యి టేగి యేళ్లఁగల నీ॰రానాఁడె తేఁజేసి, క
యాల్యలం జెన్నటినట్టి లంక గయిసే॰యంజేసి, యద్దాలచే
గాలిలంగక్కీన సజ్జెఁ గల్కిరతనాల్ ॰ గద్దెం జెలిం జేర్చి, జే
జే, లగ్గించెఁగ నెళ్ళనీ ర్జిలికి రా॰చిన్నెల్ జిగిం జెల్గఁగాఁ. 233

టీ__కయాల్య...లంకఁ=యుద్ధములచేత నందముజెడిన లంకను, సజ్జెఁ=మేడయందు, కల్కి...జేర్చి=రత్నాలగద్దెమీద స్నేహితునిఁ జేర్చి, చిన్నెలు=చిహ్నలు.

క॥ రాచనెఱిచేఁ గడానినె। లాచెక్కనిజేఁ కడరఁగ॰రహిఁగట్టియటఁ
రాచనెలకత కెనగ నేలిచెక్కనియిల, ననియతఁ॰డేలికఁ జేసెఁ. 234

టీ__రాచనెఱిచేఁ=రాజధర్మమునునుసరించి, కడాని...గట్టి=మొగమునబంగారురేకుగట్టి, రాచనెలకతకుఁ=రాజచంద్రుని(రాముని) కధకు జతగా.

ఉ॥ చేసిన సంతసానఁ జెని ॰ చీనఁగడాని జేరిని జెక్కఁగా
నేసిన చేలలం, జిగిని ॰ నిండినరాల్నగలం గడిందిజేం
డాసి,నలంగినట్టిడిని ॰ డాచితి కాచితటం చిడంగ, రా
కాసి, నడాన నంటి యిల ॰ కన్నియతేఁ డలచేలల న్నగల్. 235

టీ__(లక్ష్మణుండు) చేసినఁ=(విభీషణుని) రాజుగాఁజేసినతోడనే, చీనఁ=చీనాదేశమున, డాచితి=డాచినాడవు; కాచితి=రంక్షించినాఁడవు, ఇల...తేఁడు=రాముఁడు, అల...నగల్=ఆవిభీషణుఁ డిచ్చిన బట్టలునగలు, నడాననంటి=మధ్యను జేతితోముట్టుకొని;

శా॥ జేజేరాయనితేరి సాహిణికిఁ జే॰ర్చెం, జేర్చి యంచెంగ నా
జేజేటెంకికి నేగె నాతఁ డిఁట రా ॰ జేజేలతేఁడంత, నా
జేజేదాయలతేనిఁ గాంచి చెలి! రా ॰ సింగారి నీనేలకై
తేఁజేయంగదె యన్న నాతఁ డెదనెం॰తే సంతసానం జెనెఁ. 236

టీ__(ఆనగలను, బట్టలను) జేజే...ణికిఁ=ఇంద్రసారధిమాతలికి, చేర్చి=ఇచ్చి, అంచెంగఁ=పంపఁగా, ఆతఁడు=మాతలి, జేజేటెంకికిఁ

స్వర్గమునకు, ఇటన్=ఇక్కడ, రాజేజేలతేఁడు=రాజేంద్రుఁడగు రాముఁడు, చెలి!=స్నేహితుఁడ! రాచింగానిన్=రాజకాంతయగు సీతను, ఈనేలకై=ఈసమరభూమికి.

—* విభీషణుఁడు సీతనుదోడితెచ్చుట. *—

చ॥ చేని, యిలకన్నెఁగాంచి నెఱి • సాగిలి యన్న యడంగినట్టి లాఁ
గని,తనచేడియల్ తనర • నచ్చెలియం గయినేయ నంతటం
దనియఁగఁ జీరలన్ నగలఁ • దా నిడి చక్కనియందలాననే
తనరఁగఁజేర్చి రాచనెల • దగ్గరజేరిచె నెల్ల రెన్నఁగాన్. 237

టీ—చేని=విభీషణుఁడువెళ్లి, ఇలకన్నెన్=భూమికన్యయైనసీతను, అందలానన్=మేనాయందు, చేర్చి=యుంచి, రాచే... జేర్చెన్=రాముని కడజేర్చెను.

—* సీత యగ్నింజేరి శుద్ధురాలగుట. *—

ఉ॥ చేరిచి నంత రాచనెల • సిగ్గిలి తన్నడఁ గన్న సి గ్గైదం
జేరి,చిరా కెసంగఁ గనఁ • జేయఁగఁ జేడియఁ గాంచికల్కి! ని
న్నేరిచినట్టి చెన్నఁటిని • నేడ్వెలి దంటతనాన నెంతయే
నారిచినాఁడ, రాచనెఱి • నాఱడి జెందఁగ నీఁక నీయెడన్. 238

టీ—సిగ్గు=కష్టము, నిన్నే......చెన్నఁటిన్=నిన్ను బాధించిన రావణుని, రాచనెఱిన్=రాజధర్మమును, ఆరడి=నీఁటిబోనీక, ఆరచినాఁడన్=చంపితి.

ఉ॥ కాన, నెలంత! యిచ్చ్చ యెటఁ • గల్గిన నచ్చటి కేఁగ జెల్లనంగా, నని సీత, రాచనెల! • గట్టిగ నిన్నెద నచ్చితింక నీ
కైన నెలంత నేనిచేటి • కైన నటింగినఁ జెల్లటయ్య! యాకానన డించియేగినది • గాక, యిఁటాడఁగఁ జెల్లెనే కటా! 239

టీ—నెలంత=ఓకాంత!నచ్చితి=నమ్మితి, చెల్లెనే?=తగియుండెనా?

ఉ॥ ఈరికి సందియా లెడద • నీయెడ నాఁటిన నగ్గిఁజేరెదం,
చేరికినైన జాలియొద • నేర్చఁగ నాడిన నన్నయాన, నే
ద్దారికి నింత దగ్గరఁగ • లచ్చిన యగ్గి రగిల్చి, సీతనే
ద్దారికి నగ్గి కట్లెఱఁగి • తానఁట నగ్గిని జేరెఁ జేరిన్. 240

టీ—ఈరికి=మీకు, (ఈరు శబ్దముయొక్క షష్ఠీవిభక్తి ఈరికి) (సందేహ శబ్దభవము సందియము) దానిబహువచన రూపము, సంది

యాఅ=సందేహములు, అన్నయానన్=రామాజ్ఞను, నేల్దారికిన్=భూభృత్తునకు=రామునికి; అగ్గిని=అగ్నియందు, చేరెన్=చొచ్చెను.

ఆ॥ గాలినేస్తి సీత • గజెత తనానికిఁ
జాల్మఁజెంకి యట్టె • చేల్లనయ్యె,
నేలకన్నె యెట్టి • అాలనడాని క
డాని జిగిసలాక • గానె చెలఁగె. 241

టీ—గాలినేస్తి=వాయుసఖుఁడగు నగ్ని, సీతగజెతతనానికిన్=సీతపాతివ్రత్యమునకు, నేల...... చెలగెన్=సీత కెంపుఁనడిమి బంగారు సలాకవలె ప్రకాశించెను.

క॥ అయ్యెడ దచ్చికడలరేం। డ్రెయ్యెడఁ, దెల్చిజేతరాగ• నెల్లజేగాలన్
జేయ్యనఁజేసియడంచెడి। జియ్యల్ రానై రి నేల•జియ్యకడ కహా. 242

టీ—అయ్యెడన్=ఆసీత పరిశుద్ధురాలైన సమయమున, ఎల్ల... జియ్యల్=సమస్తలోకములను పుట్టించి గిట్టించు బ్రహ్మరుద్రులు, దచ్చికడలరేండ్రు = అష్టదిక్పాలకులు, తెల్చి=కొల్చి, నేల జియ్య=భూభర్త రాముఁడు.

క॥ ఏతెంచి యీకరణి నిల। రాతెఱఁగంట్లతెగజియ్య•రహిఁగని జేజే
చేతకయి కలిగి చొల్లల। లాతనిఁ గడతేర్చినట్టి•డా!యనియెంతేన్.

టీ—(బ్రహ్మరుద్రులు) ఏతెంచి=వచ్చి, ఇల...జియ్య=రాజేంద్రు, జేజేచేతకయి=దేవకార్యమునకయి, చొల్త...డా!= రావణునిజంపినవాఁడా!

క॥ నెఱిచేతనెన్ని తేఁడా!। తెఱఁగంట్లంగాయఁగల్గి•తిరిగద, యీరల్
కఱిజేజేకాదా? సిరి। గజెతయకాసీత? యింక • గలఁగెడిదేలా? 244

టీ—ఈరల్=మీరు. కఱిజేజేకాదా=విష్ణువుకాదా? సీత, సిరిగజెతయ కాదా?=లక్ష్మికదా?

క॥ అనిగజెతల తలకట్టైఁతనలవ యీ నేలకన్నెఁ • దగనెల్లజేగాల్
దనియించఁగలసినగదె। నెన రారఁగ నేలఁదగిన• నేల కలరఁగన్.245

టీ—గజెత...రిన = పతివ్రతాశిరోమణియై యొప్పిన, ఏలఁదగిన నేలకున్=అయోధ్యకు.

సీ॥ అని, తెలుఁగట్లతేం • డ్రికేఁగిన తేఁడంత
నానేలకన్నె చే•యంటితిగిచి
జంటఁజేరిచి తన•కంటెఁబన్నాతని
దరిఁజేర్చి,యార్కి. ని•దారకన్న
యాంతని, దాతక • న్నాతని, గాలిక
న్నాతని, నగ్గిక•న్నాతని, నల
రాకాసిరాయని• రాణదలిచేఁకంగ
హత్తి ననలసన్న • యందలానఁ
తే॥ జేరికెంకిఁ జననెంచి • దారిఁజెట్ల
గట్లఁ,గానల, జడదారి•గతితలఁ తెగఁ
గాంచియేగెడి తఱిఁదన • గతితకడలి
నీటినానిన జడదరి • నెలఁతఁగనగ. 246

టీ___తెలు...తేండ్రు=బ్రహ్మరుద్రాదులు, తేఁడు=రాముఁడు నేలకన్నె=సీత,తన...న్నాతని=లక్ష్మణుని, ఆర్కి=సుగ్రీవుని, తార...తనిఁ=అంగదుని, దాత...తనిఁ=జాంబవంతుని, గాలి...తనిఁ=హనుమంతుని, అగ్ని...తనిఁ=నీలుని, అలరాకాసిరాయనిఁ = రాక్షసరాజనువిభీషణుని, హత్తి=కలిసి, తనగతిత=తనభార్యసీత,కడలి...నెలఁతఁ= సముద్రోదకమునాచమనముజేసిన అగస్త్యునిభార్యలోపాముద్రాదేవిని

ఉ॥ ఏఁగఁగ నెంచినట్టితఱి • నిట్లనె నేలిక, యింతి! లంక కే
నేఁగఁగ నెంచియక్కడలి • నెక్కటిగట్టితటం పేటాడరా
దాఁగఁగఁజెల్లదేల!యన • నచ్చెలితేఁ జలనీటితిట్టనాఁ
డాఁగఁగఁజేసి త్రాఁగెనన, • నాతనిసత్తిని నెన్నరానిదే! 247

టీ___ఏలిక=రాముఁడు,ఇంతి!=ఓసీత!, లంక...టంచేఁ=లంకకేఁగదలచి సముద్రమునకు గట్టుగట్టితిని, ఆఁగఁగజెల్లు=చెప్పకుండనూరకొనదగును, అచ్చెలి...త్రాగె=లోపాముద్రపెనిమిటి సముద్రము నాఘ్రాంతిఁజేసెను.

చ॥ అనియతఁడంచె సీతచెవి • యక్కడ నజ్జడదారి చేడియం
గని యిలతాఁక సాగిలి త•గంగ నెఱింగి, యడింగి లగ్గటం
దనియఁగ నంత నగ్గతిత • తన్నెఱిచేకఁగ నెంచి యంచెఁగాఁ
జని యిలతేనినిం గలయఁ • జెయ్యనఁ దారట-సాగియేఁగఁగన్. 248

టీ—అగ్జెడదారిచేడియన్ = ఆయగస్త్యమునిపత్నిని, సాగిలి= పాదములబడి, ఎఱింగి=నమస్కరించి, వారు=ఆసీతారామలక్ష్మణాదులు.

తే॥ గాలికందంత జెడంచెఁ ♦ గానఱింగి
నందినానగరం గైక ♦ కందలరఁగఁ
గాంచి యేతెంచె నీయన్న ♦ గారటన్న
జాలఁగా, నాతఁ డెదనింత ♦ సంతసిల్లి.

టీ—గాలికందు=హనుమంతుండు, నందినానగరన్=నందిగ్రామమనుపల్లె యందు, కైకకందు=భరతుఁడు, నీయన్నగారు=మీయన్న రాములు,

శా॥ చెన్నారన్నగరెల్ల సంతసఁగఁ గై♦సేయించి తేర్లన్జేగా
జన్నింగట్లల నల్కతల్కడఁక నం♦దెంతంతరా సత్తినిం
గన్నాతం డెనలేని తేజెడర రా♦గా, జంటఁ దేరెక్కి త
న్కన్నం జిన్నతఁ డెంతయేని సిరి రా♦గా, నెక్కె రాహత్తినిన్. 250

టీ—నగరెల్ల...సేయించి= అయోధ్యనలంకరింపించి, తేర్లన్= రథములందు, జన్నిం...రాన్=బ్రాహ్మణులు నాల్గువేదములుఁ పఠింపుచు బ్రిక్కలరాగా, సత్తి...తండు=శక్తినిగన్న వసిష్ఠుఁడు, తన్కన్నంజిన్నఁతండు=తనకంటెఁ జిన్నవాఁడైన శత్రుఘ్నుఁడు, రాహత్తినిన్=రాజెక్కెడిపనుగను.

ఉ॥ హత్తిని నెక్కి దండ్లతెగ ♦ లండలరాఁ, జని యన్న నిచ్చ, రే
కెత్తఁగఁ గాంచి హత్తిఁడిగి ♦ హెచ్చి యెఱంగ, నెఱంగెఁ జిన్నతం,
డత్తఱి రాచదిట్ట నెన♦రారఁగ నిద్దఱ నెత్తె; నాదటన్
సత్తినిఁగన్నయాతనికిఁ ♦ జక్కఁ నెఱింగిరి సీత, రానెలల్. 251

టీ—అన్నన్ =జ్యేష్ఠుఁడైన రాముని, హెచ్చి యెఱంగన్=(భరతుఁడు) అతిశయించి నమస్కరింపఁగా, చిన్నతండు= చిన్నవాఁడయిన శత్రుఘ్నుఁడు, ఎఱఁగెన్=నమస్కరించెను, సీత, రానెలల్=సీతారామలక్ష్మణులు, సత్తి...నికిన్=వసిష్ఠునకు, ఎఱింగిరి=నమస్కరించిరి.

తే॥ కైకకందంతఁ దనయన్న♦ గారి లగ్గ
డింగి, యాయన తన లగ్గ♦డింగిన నని,
అన్నఁజిన్నల సత్తినిఁ ♦ గన్నయతని
నెన్నఁదనహత్తి నెక్కించి ♦ యేఁగ నగర. 252

టీ__లగ్గు+అడింగి=క్షేమమడిగి, ఆయన=ఆరాముఁడు, అని = పలికి, అన్నఁ=రాముని, చిన్నలఁ=లక్ష్మణుని, శత్రుఘ్నుని, సత్త్రి... తనిఁ=వసిష్ఠుని, నగరఁ=పట్టణమునందు.

ఉ॥ తిన్నని జాతిబొల్లగలఁ • దీర్చి, సరాలఁ గదించి కీల్జడఁ.
సన్నని చీరఁగట్టి, జిగిఁ•జేల్లెడి రిక్కలబైఁకఁదాల్చి, కం
తన్నని యెన్నఁగాఁదగిన • యట్టి నెలంతలదంట సేరె నా
కన్న,నిలం గలారె నెఱి • గన్నియలం చెలఁబేనిఁ గాంచేఁగాఁ. 253

టీ__రిక్కలబైఁక=చుక్కలబైఁక, కంతు+అన్న+అని=మన్మథుభార్యరతియని,

ఉ॥ కాళ్లఁగడాని యందెల జే•గాజిగి గాగర నాఁగి తేఁగి పై
చ్చెల్లఁగఁ, జిట్టచాయలిడి • చేఁదడి యార్చిడి నెల్లిచీఁకటిం
జెల్లఁగనెట్ట, సజ్జకడఁ • జెక్కఁగ నిల్చెనెలంత, తేని రా
ణిల్లఁగనంగ రాచేసిరి • నేటిల నిట్టిఁట, నిల్చెనా? యనఁ. 254

టీ__కడానియందెల=బంగారందెల, గాగర=లంగా, చిట్ట=చిత్రమైన, నెల్లిచీఁకటిఁ=వెండ్రికలచీకటిని, సజ్జ=మేడ, రాచేసిరి = రాజ్యలక్ష్మి.

సీ॥ ఇతఁడటే? రాకాసి • యేలికఁజెండాడి
రాకల్కినెనసిన • రాచేదిట్ట
ఇతఁడటే?తనయన్న • నిలకన్నియందెల్చి
క్రిచ్చేందనిల్చిన • కడిఁది జెట్టి
ఇతఁడటే? లెంకచే • నిలకన్నె నరయించి
కని,తేనికెఱిఁగించేఁ • గన్నదిట్ట
ఇతఁడటే?తనయన్న • యెగ్గాడి రాతేని
కడఁజేరినట్టి రా•కాసిజెట్టి
తే॥ అని కలికి సీతతేని, ల•చ్చన్న,నార్కి,
లంకరాయని నెంచి నె•లంతలెల్ల
ననలఁజిల్కిరి సజ్జలం • దనర నిల్చి
తేసికీరితి రేయెండ • లీసినట్లు.

టీ__సీతతేనిఁ=రాముని, లచ్చన్నఁ=లక్ష్మణుని, అర్కిఁ=సుగ్రీవుని, లంకరాయనిఁ=విభీషణుని, ఎంచి=ప్రశంసించి, తేని=రాముని

యొక్క, కీరితి=కీర్తి, సజ్జలం=మేడలందు, నెలంతలు=స్త్రీలు, ననలన్=పువ్వులను, చిల్కిర్=చిమ్మివైచిరి లేక చల్లిరి.

ఉత్సాహ॥ రాచదారి నిట్లుతింగి • రాచ తెంకిఁ గాంచి యా
రాచహత్తి, హత్తిడిగ్గి • రహినిజేరి తెంకిని,
న్గాచినట్టితల్లికెఱఁగి • కడఁకఁ జిన్న లెఱఁగఁ గై
సాచియెత్తి, లగ్గడింగ • సారెసారె కాంచటన్॥ 256

టీ—రాచదారి = రాజమార్గము, రాచ తెంకి = రాజగృహము, రాచహత్తి=రాజ కుంజరుఁడు, లగ్గు=మేలు.

ఆ॥ సీత యత్తలకడఁ • జేరిజేజేలఁ,జే
యంగఁ దారెదల నెసంగఁజెలఁగి
రంత సంతసాన • నాకె చెల్లెండ్రింద
ఱెఱఁగ లగ్గడింగ • నెత్తికేల॥ 257

టీ—అత్తలకడన్=కౌసల్యా సుమిత్రా కైకలదగ్గర, జేజేలన్=నమస్కారములను ఆకె=ఆసీత యొక్క, చెల్లెండ్రిందఱు=ఊర్మిళా,మాండవీ, శ్రుతకీర్తులందఱు.

—* శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడగుట. *—

సీ॥ అంతట నేలతేఁ • డల,సత్తిఁగన్నట్టి
నేలజేజేయాన • నీళ్లతిట్ట
లందలి, జేక్కఱు • లందలి నీటిని
దేఁజేసి నల్ నీళ్ల • తిట్టల నడి
నేలఁగల్గిన తేండ్ల • నేలజేజేదండ్ల
జేడదారి దంటల • నడరఁ జేర్చి,
నాగటి చాల్సన్న • నాతి,తాఁదగఁజేరి
లెస్సతగ్గని నాఁట • లెస్సయయ్య
తే॥ లానఁ జేడలనడల్చి, నీ • రాడి,చీని
చేలలన్ రతనాల సరాల నగలఁ
దాల్చి తానెలనాగ, గందాలలంది
కడఁకసిరిగటిజేజేల • కరణినిల్చి. 258

టీ—నేలతేఁడు=రాముఁడు, సత్తి...యానన్=వసిష్ఠుని యాజ్ఞను, జేక్కఱులు=నదులు, నాఁగ...నాతి=సీత.

చ॥ నెఱసరి గద్దె డాకడన ♦ నెల్లలదంట నెలంగనిల్చి, జ
క్కుఱ తెగనీటనింగలికి ♦ కల్కికడాని కడింది తాంగ్రిటి ని
ద్దఱకటు జెన్నిగట్టడర ♦ దంటతనాన నెసంగc గట్ట, న
క్కఱగని నేలకన్నె కెన ♦ గాc గయిదండల నేలc దాలిచెన్. 259

టీ__నెఱసరిగద్దెన్=సింహాసనమందు, డాకడన్=వామభాగమున, కడాని...తాంగ్రిటినిన్=బంగారు పట్టలను, కైదండలన్=బాహుదండములందు నేలన్=భూమిని, తాలిచెన్=ధరించెను.

ఉ॥ చేలల దండల న్నగల ♦ జిడ్డిడcజొలిన యాలసిచ్చి, జే
జేల కడింది తిండికెన ♦ జేయcగcజొలిన తిండి నేలజే
జేల కడింగి నట్లయిడి ♦ చెచ్చెరనట్టిరి కెల్లతెన్న జే
జేలకడంకనిచ్చె, నిల ♦ చేడియ గాదిలికన్నె తేc డహా!. 260

టీ__చేలలన్=వస్త్రములను, జిడ్డిడ......యాలన్=పాలిచ్చుగోవులను, జేజే......తిండికిన్=అమృతమునకు, నేలజేజేలు=భూసురులు, ఇల......తేcడు=భూమికన్యాభర్తన్.

ఉ॥ రక్కసితేని కార్కికిని ♦ రాణcదలిర్చెc గడానిచేలలం
జెక్కని దండల న్నగల ♦ సంతసగానిడి, నింక నట్టిరై
చిక్కినయట్టిరిం గడcకc ♦ జేరcగదీసి కడానిచేలలం
జెక్కనిదండలిచ్చి నెఱc ♦ సాగcగ నంచెcగ నేగి, రయ్యెడన్ 261

టీ__రక్కసితేనికిన్=విభీషణునకు, అర్కికిన్ = సుగ్రీవునకున్, కడానిచేలలన్=బంగారు బట్టలను, అట్టిరు=అటువంటివారు, చిక్కినయట్టిరిన్=మిగిలినవారిని.

సీ॥ తలయెత్తcగాలేక ♦ తలcకి నీటండాగ
నైనట్టి నలదాసరీని దెగడి
నెఱసరికిం జెంకి ♦ నీరేయడం గాఱి
చెడి హత్తిరాయల ♦ చెడ్డనెంచి
నెఱకలంతటcగల్గి ♦ నెఱcదెల తెలచేన్న
యేcదేటికనిచాల ♦ నీసడించి
కనలేక, పేరలేక ♦ కైసిరియాలేక
నేలదాల్చినతేని ♦ నెఱని దెగడి

తే॥ కదలి చేనలేక నిల్చిన • గట్లనెంచి
దిట్టరైయె నెఱసరియయి • తేజడరఁగ
కైసిరింగల్గి, నడయాడఁ • గల్గినట్టి
తనకయింం జేర సిలయేలెఁ • దనర జియ్య. 262

టీ—నలదాసరినిఁ=కాబేలును, (ఆదికూర్మమును) నెఱసరికిఁ=సింహమునకు, హత్తిరాయల = గజరాజేలయొక్క, (అష్టదిగ్గజముల యొక్క) నెఱకలు=వెండుకలు, ఏఁదు=తెల్లనిపంది (శ్వేతవరాహము) నేలఁదాల్చినతేనిఁ=భూమిధరించినవానిని (ఆదిశేషుని) గట్లఁ=కులగిరులను, దిట్ట=ధీరుఁడు, నెఱసరి=శూరుడు, జియ్య=ప్రభువగు రాముఁడు.

క॥ సిరిచేఁ, జేక్కనినెఱకై । సిరిచే, జతలేనిరాచే • సిరిచే, రేరా
సిరిఁజేఁజేరచెడి కీరితి । సిరిచే, దాశరథి నేల • చేడియ నేలెఁ. 263

టీ—సిరి=సంపద, రాచేసిరి=రాజసంపద, నేలచేడియ=భూమి.

చ॥ సిరిఁదెఱఁగంటితేని దెసఁ • జెల్లఁగ గాలికి గల్గినట్టి, డా
సిరికెనగాఁగ డాకడన • సీత తనచేఁగ, నీటిరాదెసఁ
సిరిఁదెగడంగ నెల్లికయిచే నిల లచ్చన, యెల్లరండఁ గై
సిరి సెలగంగఁ గాల, నిల • చేడియఁ జేడగ నేలె తేఁడహా! 264

టీ— తెఱ...దెసఁ=పూర్వదిశను, గాలి...నట్టిడు= హనుమంతుఁడు, డాకడన=వామభాగమున, సీత=జానకి, నీటిరాదెసఁ = పశ్చిమమున, ఎల్లికయిచేఁ=ఛత్రహస్తముతో, గొడుగుబట్టినవాఁడై, లచ్చన=లక్ష్మణుఁడు, ఎల్లఱు=అందఱు, (భరతశత్రుఘ్నులు,మొ॥) కాలఁ=ప్రకాశింపఁగా, తేఁడు=రాముఁడు, ఇలచేడియఁ=భూమిని, చేడగఁ=భార్యగా, ఏలెఁ=పాలించెను.

చ॥ నెతెనడ లేళ్లయంద, కఱ • నెత్తల కీల్జడలంద, యాగడా
లెఱవిఁదినంగలారియెడ • నెద్దడి యెద్దడియంద, కల్కలా
గతెతల యెడ్డలంద, కనఁగాఁదగఁ గీరితి కల్కి నంతట
న్నెఱయఁగఁజేసి, యక్కటిక • నిండఁగ రానెల నేల నేలెఁ దాఁ.

టీ—నెతెనడ=సంకరనడక, కఱ=నల్పు), ఆగడాలు=అగడములు, ఎఱ...యెడఁ = మాంసభక్షులునైన రాక్షసులందును, ఎద్దడి= దరిద్రము, ఎద్దడియంద=దరిద్రముననే (లేమిలేమియందే యున్నదనఁగ దరిద్రములేక భాగ్యమెకలదనుట) కల్కలు=కలకలు, గతెత......లంద=

అడువాఁటిన నన్నులందె, తగిన్=ఒప్పునట్లు, కీరితికల్కిన్=కీర్తికాంతను, నెఱయంగన్=వ్యాపింపఁగా.

క॥ ఈకరణినెల్లతెన్నుఁగ। రాకన్నా కెల్లకడల • రహిఁగెల్పియటన్
డీకడరఁజేసి జన్నా। లేకడఁ దనయాన లడర • నేలెన్ నేలన్. 266

టీ—రాకన్నాకు=రాజశ్రేష్ఠుఁడు, కడలన్= దిక్కులను, జన్నాలు=యజ్ఞములు, ఆనలు=ఆజ్ఞలు, నేలన్=భూమిని, ఏలెన్=పాలించెను.

—* రాముఁడు హనుమంతునకుఁ దనతత్త్వముదెల్పుట. *—

చ॥ తనచెలిదంటకై కడలి • దాటి కడిందిగఁ గన్గొఁజెందె నీ
యన చెలియైన సం, తయిన • నారయ నందక నన్ను, తెల్చె, నం,
చని తెలి చౌనతేనిసిరి • నందెడి కోర్చ్చిడి; యాంజనేయ! నే
నని తెలియంగదయ్య తిగ • యయ్యలకాదరిజయ్యనం చెదన్. 267

టీ—(రాముఁడు)తనచెలిదంటకై=తనరమణీమణిసీతకొఱకు, ఈయన=ఈహనుమంతుడు, చెలియైన=భార్యయైన, సంతయిన=సంతానమైనను, అందక=పొందక, నన్ను=నన్నె, తెల్చెన్=కొల్చెను; అంచు+అని=అనుకొని, తెలి...సిరిన్=భవిష్యత్ బ్రహ్మాధిపత్య సంపదను, అందెడి, కోర్చ్చె=కోరిక,ఇడి=ఇచ్చి,తిగ...జయ్యన్=మూఁడుమూర్తులపై వాఁడనగుపరబ్రహ్మమును, ఎదన్=హృదయమున, నేనని...దయ్య=నేనని తెలియుము.

సీ॥ నా నీడ యనియెడి • నాగటిచాల్కల్కి
నిడఁ జెఱ నే ననియెడి చెనంటి
చాల్తలలగయాలి, • చేయ్యన నడ్డి నీ
యెదయయ్యగారిచే • నెఱిఁగి యార్కి
జానైన దారికలాన, నిల్లా ల్పఁత
నెడి కడలిందాటి • నెఱిని లంక
యనియెడికాల్సేయి • నలరఁగట్టినదాని
జేరి నేననియెడి • చెడ్డరక్క
తే॥ నీని తలలెల్లఁజెండాడి • సీతనీడఁ
జేర్చినాయంద యేరికి • నేర్చరాని
జెట్టినైన నేఁజేరితిఁ • జెడనిటెంకి
ననియెఱింగద రెక్కఁగలట్టి • రెదల. 268

టీ__ఎఱ్ఱుఁగలట్టిరు=ఎఱుకగలవారనఁగా, దమను దా.మెఱిఁంగి నవారు, నేఁ అనియెడి=అహంకారమనెడు, చెనంటి...యాళి=వరుసతలలచెదుర వణుడు, నా=రాముఁడనైననా యొక్క, నీడ...కల్కిఁ=నాఛాయయైన సీతను, అనగా నాప్రకృతి కాంతను, చెఱఁ=చెఱసాలయందు, ఇడఁ=పెట్టగా, అద్ది=ఆపెట్టుటను=నీ...నెఱిఁగి=నీహృదయగురుబోధచేఁదెలిసికొని, ఆర్కి...కలానఁ=సుగ్రీవుఁడనెడి నౌకామార్గమున, ఇల్లా...దాటి=కుటుంబసముద్రము దాటి, లంక...దానిజేరిఁ=లంకాపట్టణశరీరముజేరి, నేనని...చెండాడి=అహంకార రావణునిజంపి, సీతనీడఁ=సీతయను (నాప్రకృతిని,) ఛాయను, నాయంద=నాయందె, చేర్చి=ఉంచి,ఎరికి నేఁ=ఇట్టివాఁడనని యెవరికి దెలియఁబడనినేను,చెడనిటెంకిఁ=చెడనిపరబ్రహ్మస్థానమును,చేరితిఁ=చేరినానని,ఎదలఁ=మనస్సులందు, అని యెఱింగెదరు=అని తెలిసికొందురు.

క॥ కలఁకలిఁక నేల?కందా! యలతిగజేజేలకంద ♦ నట్టిదయిన "త"
ళ్కులరంగ"నేన"యనియెదఁ।దెలియఁగదయ్యాయని లెంకఁ♦దేరిచెనచ్చోఁ

టీ__కందా=బిడ్డా!, అల...యిన = మూఁడుమూర్తులకుజిక్కని తళ్కు=వెలుఁగు, నేన=రాముఁడనైననేనే, లెంకఁ=భటుని, తేరిచెఁ.

క॥ ఈకరణిఁదెలియనాడిన । నాకప గేసరికిఁగల్గి♦నట్టిడలరి తా
నాకడిదిరాయఁడనియెద । దాకంగాఁదెలిసి హాయిఁ♦దసరం గాంచెఁ

టీ__కేసరికికల్గినట్టిడు=(హనుమంతుఁడు) ఆంజనేయులు, తానా...దెలిసి=జ్ఞానాపరవస్తువయిన రాముఁడనేనని, హాయి...గాంచెఁ=సంతసించెను.

క॥ అనిదిండిజేడలదారి యిటని తెలియంజేయఁజెక్కు♦నాలించి రహిం
దనిసి, తగసంతసిల్లెం । గణంకఁ గాల్దిండ్లటెంకిఁ ♦ గలిగి నతఁ డెదఁ.

టీ__అని...దారి = కలహాశనముని (నారదుఁడు) గాల్దిండ్ల...నతఁడెదఁ=వల్మీకభవుఁడగు వాల్మీకిమునముని, సంతసిల్లెఁ=సంతోషించెను.

## —* ఫలశ్రుతి *—

క॥ ఈకతనాడినఁజేసిన । నేకడనాలించినఁ ర♦హిని, లగ్గిడెడిఁ
డీకలర నేలకన్నియ । రా, కలకలఁదీర్చిచేర ♦ రాఁదీసితగఁ. 272

టీ__ఈకతఁ=రామాయణమును, ఆడినఁ = చేదివిన, చేసిన =

గ్రంథరచనగావించిన, ఆలించినన్=వినిన, నేలకన్నియరా=భూకన్యాభర్తరాముఁడు, లగ్గున్=మేలును, ఇడెడిన్=ఇచ్చెడిని.

క॥ ఆలించేక లగ్గీయని। తెలికతెల్గనెద రిద్ది ♦ తెలియక యేరేన్
దేలికగ నేలకన్నియ। యేలిక నన్నట్టరంద ♦ రే! లగ్గంతేన్. 273

టీ—ఆలించేక=సరిగావినక, ఏరేన్=ఎవరైనను, తెలికతెల్గు+ఆనెదరు=తేలికగైన తెనుఁగుమాట లేకపియందురు.

—♦ విజ్ఞాపనము ♦—

క॥ చేతనయినట్లు యల్లితి। సీతటి నెఱ, నెన్నక కన♦రే! కయిరాయల్
కైతల నల్లిన నెఱకయి। తాతలదారి నిలకన్నె♦దారినెటేకతన్. 274

టీ—కయిరాయల్=కవిశ్రేష్ఠులు, కైతల......దారిన్=కవిత్వముచెప్పిన కవిబ్రహ్మల మార్గమున, ఇల......కతన్=రామునికథను నెఱసు=తప్పు, ఎన్నకకనరే=ఎంచకుండ జూడుఁడు.

—♦ ఆశ్వాసాంతము. ♦—

క॥ సీకంటెలాతియైనది! యేకడ నరయంగలేక ♦ యొక్కడఁగన్నన్
దాకంగనిలిచి యొల్లెడ। లేకలకల నందనీక ♦ యేలెడిదిట్టా!. 275

టీ—లాతి=ఇతరము, కలకలన్=కల్లలను, దిట్టా=శ్రేష్ఠుఁడా!.

మాలిని॥ చెడ కడరినదంటా! ♦ చెడ్డగా కాసికంటా!
అడ లడఁచెడిగండా! ♦ యంతటం గల్గతండా!
చెడని సిరిఁ గలాఁడా! ♦ సీత కాల్గంటిజేఁడా!
అడఁగని జిగికాఁడా! ♦ యార్కికిన్ సంగడీఁడా!. 276

టీ—దంట=నేర్పరి, కంటా=పగవాఁడా!, గండా=మొనగాఁడా, కలాఁడా=కలవాఁడా, సంగడీఁడా!=చెలికాఁడా!.

—♦ పుష్పమాలికాబంధము. ♦—

సి రిఁ గా సె రి, జో
చ॥ సిరి సీతజి కిలిస కిఁ దాసరి నంగస కిన్న లి కాల్
గె ల్లుఁ, తా జే ద్రి, నే

సి గ నే ద గఁ దం
హరి, సంత న గాంచి న గద్ద రి, నన్ను ద గాచె డి రా!॥ 277
దా ల్ల యై జే న్నె దం

—◆ గద్య ◆—

తే॥ ఇద్ది యయ్యరాజేనియెడి ◆ యింటఁసన్న
దగిన శేషయ్యకందుఁడు ◆ తనరినట్టి
య్యాంజనేయాఖ్యఁ జెలఁగిన ◆ యతనిచేత
నెసఁగె "దాశరథిచరిత్రి" ◆ నిదికడకత. 278

టీ—అయ్యరాజే=అబ్బరాజు, శేషయ్యకందు=శేషయ్యకొమారుఁడు, ఆంజనేయాఖ్య......చేతన్=ఆంజనేయుల పేరుచేఁ బ్రకాశించెడు హనుమంతరాయ శర్మ పాకయాజిచేత, దాశరథి చరిత్రిన్=రామాయణమందు, ఇది=ఈ గ్రంథభాగము, కడకత=చివరకథ (తృతీయాశ్వాసము) ఎసంగెన్=ఎక్కువగా వ్యాపించెను.

గద్య

ఇది శ్రీమత్సుగ్రీవ పట్టాభిషేకాద్యనేకాంధ్రగ్రంథనిర్మాణ చాతురీ ధురంధర సద్యశోబంధురకౌండిన్యసగోత్ర కలితాపస్తంబసూత్రచతుర్విధ కవితామతల్లి కాబ్బరాజాన్వయ పయఃపారావార రాకాకైరవమిత్ర నృసింహామాత్యపౌత్ర, బొగ్గవర సుబ్బకవిరాయ దౌహిత్ర శ్రీద్వైతాద్వైత మతప్రతిష్ఠాపన నందిరాజ లక్ష్మీనారాయణదీక్షిత ద్వితీయ దౌహిత్ర ప్రియ మంగాంబా శేషాచలామాత్య తనయ సుధీవిరాజి హనుమంతరాయశర్మ పాకయాజి ప్రణీతంబైన శ్రీ మదచ్ఛాంధ్రనిరోష్ఠ్య నిర్గద్య దాశరథి చరిత్రింబునందు దృతీయాశ్వాసము.

---

సర్వేజనాస్సుఖినో
భవంతు.

---

తే॥ గీ॥ కబ్బము నొసర్చినటువంటి ◆ కవిని సాయ
ముంచుకొనుచుఁ డీకను వ్రాసి ◆ యున్నవాడ
"సుజనరంజని" నాఁబేరుఁ ◆ జొనిపినాఁడ
తప్పులెన్నక కైకొనఁ ◆ దలఁచినాఁడ
"నబ్బరాజె సీతారాముఁ"◆డనెడు వాఁడ.

142

## అచ్చు కానున్నవి.

1. అచ్చాంధ్ర నిరోష్ఠ్య-నిర్గద్య నృగచరిత్ర.

2. శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్ర.

3. తైత్తిరీయస్మార్త బ్రాహ్మణ హస్తభూషణము.

4. అభిమన్యుఁడు. } (వచనము.)
5. కళాపూర్ణుఁడు. }

6 నిరోష్ఠ్య ధనంజయ తీర్థయాత్ర (రూపకము)

7 ఆంధ్రమాఘ మాహాత్మ్యము.
8. ఆదినారాయణ శతకము.
9 ముద్దుమురారి శతకము.
10. శ్రీ త్రికూటాచల చరిత్ర. (యక్షగానము.)

} మదీయ జనకులైన అ. శేషాచలముగారి కృతము.

12. అంబరీష చరిత్ర.

13. కవికర్ణ పేయము.

వలయువారు —

అ॥ హనుమంతరాయశర్మ పాకయాజి,
ఆంధ్రపండితుఁడు
బి. హెచ్. స్కూలు, పెదవలి (పోస్టు.)
వయా, తెనాలి, గుంటూరుజిల్లా.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B130 |
| పుస్తకం పేరు | దాశరథిచరిత్ర |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ,10,13, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | vedavathi |
| పేజీలు విడదీసినది | vedavathi |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | Nil |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |